దేముడి న్యాయం , నీకేమీ లోపం రానీయదు 20 -4-22

తిమింగలాల జీవిత విధానాన్ని , దానికి సంభందించిన వివరాలని మానసికంగా కుంగిపోతూ వున్నా మా ఆక్క గారికోసం అని సేకరించాను . ఆమె ఈ మధ్యనే కొడుకు పెళ్లి చేసింది [] . స్వాతి ముత్యం లాంటి ఆ పిల్ల వాడిని వాడి అత్తగారు కబ్జా చేసి చంకన ఎత్తుకొని గోరు ముద్దలు వంటి సలహాలు పెట్టి తనకు తోచినట్లు నడిపించు కో సాగింది [] అప్పుడు మా ఆక్క ఉక్రోషంగా " వాళ్ళ సంగతి సరే వాళ్ళు నీచులు - కానీ మనవాడి బుద్ధి ఏమయినది ? అని కన్నీరు పెట్టుకుంది - మనస్సులో కుంగిపోతూ ఆరోగ్యం చెడకొట్టుకో సాగింది [] మా అక్కను సమాధానపరిచి ఆమెకు మనశాంతి కలిగించటానికి అని నేను అసలు దేముని న్యాయం ఏమిటి అని పరిశోధించాను [] చివరికి న్ పరిశోధన ఫలించింది . [] ఈ .పరిశోధనా ఫలితాలు విని గ్రహించి మా ఆక్క చక్కగా కోలుకుంది [] అందుకని ఆ పరిశోధనలోని సంగతులు అవీ ఇక్కడ రాస్తే, ఆ విషయాలు చదివి మా అక్కలా మనస్సులో మధన పడుతున్న వాళ్ళు ఇంకా ఎవరైనా ఉంటే వాళ్ళు కూడా మామూలు అవుతారు ఏమో? అని అలోచించి ఇది రాస్తున్నాను []

తిమింగలాలు జాపనీస్ భాషలో ఆర్కాస్ అంటారు [] ఆర్కాస్ అంటే సముద్రములో నివసించే రాజు [] రాజుగారి మీదా అయన జీవితం మీదా మామూలు ప్రజలకు ఆసక్తి ఉండటం సహజమేకదా ? అందువల్ల జాపనీస్ శాస్త్రవేత్తలు వరుసగా రెండు సంవత్సరాలపాటు రాజుగారిని అయన జీవన శైలిని పరిశీలించి మనకు పనికి వచ్చే కొన్ని సంగతులు కనిపెట్టారు
తిమింగలం జాతిలో మొగదానికి అంటే రాజుగారికి పెత్తనము ఏమీ ఉండదు - ఆడదానిదే అంటే రాణీగారిదే పెత్తనము.సముద్రము అంతా దానిదే . అంటే ఇంటి సంగతులన్నింటి మీదా దానిదే పైమాట .
అత్త కింద కోడళ్లు ఉన్నట్లు వయసులో పెద్ద అయినా ఆడ తిమింగలం కింద . మిగతా ఆడ తిమింగలాలు కొన్ని ఉంటవి . ఆవి కూతుళ్లు కావచ్చు కోడళ్ళు కావచ్చు . ఈ ఆడ తిమింగలాల కిందనే మొగతిమింగలాలు ఉంటాయి. క్రింద వుండటము అంటే చెప్పినట్లు వింటూ వుండటము అన్న మాట [] ఇట్లగా ఆడ మోగా లన్నీ కలిసి పదిహేను ఇరవై వరకూ గుంపు కట్టి ఒక వుమ్మడి కుటుంబములా జీవిస్తూ ఉంటవి [] మనము స్వగోత్రీకులను పెళ్లి చేసుకోనట్లే - మొగతిమింగలాలు తమ సొంత గ్రూప్ లోని ఆడ తిమింగలాలతో జతకట్టవు []వాటిని ప్రేమించవు [] మరి మార్గం ఏమిటంటే ? ఆడ తిమింగల కన్య సముద్రాలన్నీ తిరిగి వేరే గ్రూప్ లోని మొగ తిమింగళాన్ని ఆకర్షించి , వాడ్ని వాళ్ళఅమ్మ కంట్రోల్ లో నుండి తప్పించి విడిపించి - తనవెంట సముద్రాలూ దాటించి తీసుకొని వచ్చి తన పుట్టింటి గ్రూప్ లోకి కలిపేసి - తాను తల్లి పెత్తనం కింద ఉంటూ - భర్తను తన పెత్తనం కింద ఉంచుకుంటుంది .దీని వల్ల ఏమి జరిగిందో చూసారా ? పెళ్లి,అని , ఆతరువాత పిల్లలు అని మోజు పడ్డ ఒక మొగ అబ్బాయి తిమింగలం - - తనను ఆకర్షించిన ఆడ కన్యా తిమింగలం వెంట పడి - తన పుట్టింటిని వీడి అత్తారి ఇంటి గ్రూప్ లో చేరి అక్కడ ఆడ పెత్తనం కింద బ్రతుకుతూ వున్నది [] ఇది ప్రక్రుతి న్యాయంగా లక్షల సంవత్సరాలుగా అమలు అవుతూ వున్నదని శాస్త్రవేత్తలు కనిపెట్టారు []
నేను పై విషయాలు అన్నీ మా అక్కకు చెప్పి " అక్కా బెంగటిల్లకు, , ప్రక్రుతి అనగా దేముడి న్యాయం ప్రకారం , అది ఎవరితో అనగా నీ కోడలు వచ్చి నీకొడుకును ఎత్తుకు పోయి తన గ్రూప్ లో కలిపేసుకుంది - ఇలాగే నీ బొట్టి అనగా నీకూతురు ఎవడినో

ఆకర్షించి తీసుకువచ్చి నీ గ్రూప్ లో కలిపేస్తాది . దేముడి న్యాయం నీకెప్పుడూ , నీకేమీ లోపం రానీయదు అని నచ్చ చెప్పాను [] న్నా ఓదార్పుకు మా ఆక్క ఎగిరి లేచి, అల్లుడి కోసం వెతక సాగింది [] ఓ జగదీశ్వరా కోరి కోరి అచ్చంగా మొగ పిల్లలనే కన్న తల్లి తండ్రులకు ఏమి న్యాయం నిర్ణయం చేసావు ? అని నేను అడిగాను .ఇంకో పరిశోధన చేసి సమాధానం లభించగానే అడిగిన వారికి చెప్పు అని అని అయన నవ్వాడు []

-----------------------
పి
ల్ల దయ్యం డెల్లాయి కథ 114-22
పూర్వం ఒక వూరిలో గడ్డాలు బాగాపెంచి - నేను గొప్ప జ్ఞ్యానిని అని అందరినీ నమ్మిస్తూ , -ప్రజలకు తన మీద వున్నా ఆ నమ్మకం సొమ్ము చేసుకోవాలని " మీకు కీడు - పీడా జరగబోతున్నది " అని చెప్పి . ఎదుట వారిని దడిపించి , బెదరకొట్టి - ఆ కీడు తొలగించే శక్తీ తనదగ్గర వున్నదని నమ్మించి - వారి నుండి సొమ్ములు గుంజుకుంటూ రాజా భోగాలతో బ్రతుకుతుండే వాడు [] . ఒక నాడు ఈ దుష్టుడు , ఒక అమాయక భక్తురాలు ఐన స్త్రీ యొక్క పెద్ద భవంతి మీద కన్ను వేసి , ఆ భవంతిలో ఏదో దయ్యం తిరుగాడుతున్నదని ఆ స్త్రీని నమ్మించి , ఆమె ఆ భవంతి ని వదిలి వెళ్లేలా చేసాడు [] ఆ తరువాత ఆ భవంతిని తాను జబర్దస్తీగా ఆక్రమించి ఆశ్రమంగా మార్చుకున్నాడు [] వంచనకు తట్టుకొలేని ఆ స్త్రీ మతి చెలించి మనుషులపట్ల ద్వేషం పెంచుకొని అనాధ అయి చివరికి స్మశానములోని సమాధుల మధ్యకి చేరి జీవించ సాగింది [] ఈమె వున్నా సమాధుల దగ్గరనే , చోటనే ' తల్లి ప్రేమ అంటే ఏమిటో రుచి చూడకుండా అనాధగా మరణించిన ఒక 10 యేండ్ల బాలిక సమాధి వున్నది [] ఆపిల్ల ఒక మంచి దయ్యంగా మారి ఆ స్మశానం లోనే తిరుగుతూ ఉండేది [] దాని పేరు డెల్లాయి [] స్మశానం లోని మిగతా దయ్యాలన్నీ డెల్లాయిని ముద్దుగా చూసుకుంటూ , ప్రేమ కొద్దీ దానికి అనేక శక్తులను బహుకరించాయి []
ఇక్కడివరకూ రాసినాక డెల్లాయి అనే మంచి దయ్యం అనాధ అయినా స్త్రీ తరుఫున దుష్టుడిని బెదిరించి, అతడి చేత భవంతిని ఖాళీ చేయించి తిరిగి ఆమెకు అప్పగించి ఉంటుందని మీకు తోచే ఉంటుంది [] డెల్లాయి , దుష్టుడి చేత భవంతిని ఎల్లా ఖాళీ చేయించింది అన్నదే ఈ కధలో తెలుసుకోవాల్సిన విషయము
అన్ని సినిమాలలో మాదిరి డెల్లాయి పంపులలోనుండి రక్తం తెప్పించింది [] అర్ధరాత్రి పన్నెండుకాగానే ఇనుప బూట్లు వాటి మీద గజ్జెలు కట్టుకుని - భయంకర శబ్దం తెప్పిస్తూ భవంతి అంతా తిరిగింది మెట్లు ఎక్కి దిగింది [] దెయ్యం వున్నదని దాన్ని లొంగ తీయటం తన వల్ల కాదని దుష్టుడికి తెలిసి పోయింది []అతడు భయపడి పోయాడు [] అప్పుడు డెల్లాయి ఇట్లా చేసేది [] దుష్టుడు ఫ్యాన్ వేసుకుంటే ఆ ఫ్యాన్ రెక్కలు ఎర్రగా నిప్పులలో ఉడికించిన ఇనప ముక్కలలా మారి వెచ్చని గాలి వీచేవి [] ఏసీ వేసుకుంటే - ఏసీ యూనిట్ మొత్తము మంచు ముక్కాలా చల్లగా గడ్డ కట్టుక పోయేది []
దుష్టుడి భవంతికి దెగ్గరలోనే ఒక స్కూల్ ఉండేది [] పిల్లలు మధ్యాన్నం భోజనాలు చేసి మళ్ళా క్లాసులకు వెళ్ళినాకగానీ దుష్టుడికి నోరు తెరిపిడి పడి అన్నము తినటానికి వీలు అయ్యేటట్లు , డెల్లాయి ఒక మంత్రం వేసింది []
పిల్లలు అందరూ మధ్యాన్నపు భోజనాలు చేసి క్లాసులకి వెళ్లినా క కూడా దుష్టుడికి నోరు తెరిపిడి పడక పోతే అతను స్కూల్ కి వెళ్లి అన్నం తినకుండా పస్తు వున్నా పేద పిల్లలెవరో కనిపెట్టి వారికి లంచ్ బాక్సలు ఇవ్వాలి [] అన్నము తినకుండా ఖాళీ కడుపుతో భాద పడుతున్న పిల్లలని డెల్లాయి తన శెక్తితో గుర్తు చూపిస్తుంది [] దుష్టుడు

వారికి మంచి మంచి వంటలతో లంచ్ బాక్స్ ఇవ్వాలి [] ఎదో, తూ, తూ మంత్రం లంచ్ బాక్స్ ఇచ్చి
"హమ్మయ్య మమ "అనుకున్న రోజున దుష్టుడి భాద వేరుగా ఉండేది [] అతని చేతిలోని అన్నము ముద్దా చిన్న పక్షిలా మారి, కీచుకీచు మని అరుస్తూ ఆకాశంలోకి యెగిరి పోయేది []వీడికి ఒక్క ముద్దా నోట్లోకి పోయేది కాదు []
అందరిని దడిపించి పొట్టపోసుకునే ఈ దుష్టుడికి భయం నేర్పాలని డెల్లాయి నిర్ణయించుకుంది [] దుష్టుడి మాయ మాటలు నమ్మి అతనికి భక్తిగా నమస్కారం చేసిన భక్తుల కనుగుడ్లు రెండుగా మారిపోయేవి - ఎట్లాగంటే ఒక వేరుశనగ కాయలో రెండు గింజలు ఉన్నట్లు ఒక కంటిలో రెండు కను గుడ్లు ఉండేవి [] కళ్ళు నిజంగా అల్లా అయ్యేవి కావు కానీ అద్దములో చూసుకున్నప్పుడు భక్తుడికి అలా కనపడేవి [] వారు బెదిరి పోయేవారు ఇలాంటప్పుడు, పూర్వము అయితే ఈ దుస్టుడు వారిని " నిన్ను ఏదో దుష్ట శక్తీ ఆవహించింది " ఎంతో బెదిరించి లక్షలు గుంజి జపాలు తపాలు జరిపే వాడు []కానీ ఇప్పుడు అల్లా కాకుండా ఈ దుష్టుడు " నేను ఏదో పొట్టకూటి కోసం చెపుతాను అంతా నిజం కాదు అన్నిటికీ ఈశ్వరానుగ్రహమే ముఖ్యము " అని మనస్పూర్తిగా ఒప్పుకున్నప్పుడే భక్తుల కనుగుడ్లు మామూలుగా అయ్యేవి [] ఈ దెబ్బకు గురువుగారు దొంగమాటలుచెప్పుట మానేసి " ఈశ్వరానుగ్రహ ప్రాప్తి రస్తూ " అని దీవించా సాగాడు []
డెల్లాయి, దుష్టుడికి చివరి డోసు ఇచ్చింది [] అదేమిటంటే దుష్టుడి కాళ్ళు వున్నట్లుండి అగ్గి పుల్లల్లా మండుతుండేవి [] ఆ తరువాత కాళ్ళు సాంబ్రాణి కడ్డీ లలాగా కాలుతూ తొడల వరకు కాళీ పోయేవి [] ఆ కాల్పుకు కాలి మీద చర్మము - కాల్చిన వంకాయ మీద తోలు ఊడివచ్చినట్లు ఊడి వచ్చేది [] దీనితో దుష్టుడు నేలమీద బోర్లా పడి డెల్లాయికి నమస్కారం చేసాడు [] అప్పుడు డెల్లాయి ఇట్లా చెప్పింది . నీ కాళ్ళు కాలి చర్మము ఊడి రాకుండా ఉండాలంటే - నువ్వు సైకిల్ కి గాలి కొట్టే పంపు ఒకటి తీసుకొని స్కూల్ ఎదురుగా నిలబడి , చక్రాలలో గాలి పోయి సైకిల్ ని తోసుకుపోతున్న పిల్లలని దగ్గరికి పిలిచి వారి సైకిల్ చక్రాలలో గాలి నింపి వారు సైకిల్ తొక్కుతుంటూ, తూనీగలల్లే ఇంటికి పోయేటట్లు తోడ్పడు . పంచర్ ఉంటే అది కూడా వేయి .ఇది నీ భాద్యత . పిల్ల ల దెగ్గర పైసా కూడా ఆశించకుండా అంతా సేవా దృష్టితో చేయి .రోజున ఎంత మంది వచ్చినా కాదు అనకుండా గాలి కొట్టాలి , లేదంటే కాళ్ళు కాలి చెర్మం ఊడి రావటం "తప్పేదేలే "అని చెప్పింది []
దుష్టుడు డెల్లాయి చెప్పినట్లే చేస్తూ - కాళ్ళ తోలు ఊడి రాకుండా జీవించటం మొదలెట్టాడు [] ఇన్ని జరిగి దుష్టుడి తిక్క కుదిరినాక, డెల్లాయి - దుష్టుడిచేత ఆ భవంతిని , అసలు యజమాని అయినా ఆ అమాయక స్త్రీ పేరిట తిరిగి పక్కాగ్గ రిజిస్టర్ చేయించింది [] దుష్టుడు పూర్వం భవంతిని ఆక్రమించుకోగానే నాలుగు కోట్లు ఖర్చు పెట్టి భవంతిని ఇంకా బాగు పరిచాడు - అమాయ క స్త్రీ పడ్డ కష్టానికి తగిన ప్రతిఫలం దొరికినట్లు అయ్యింది [] ఈ నాటికీ మన దుష్టుడు పిల్లల సైకిల్ ఛేక్రాలకు ఫ్రీగా గాలి నింపుతూ - అంతకు ముందు సంపాదించినది పైసా పైసా లెక్క చూసుకుంటూ , పొదుపుగా తింటూ దేవుని దయకు సాటి వచ్చేది లేదు అని చెపుతూ బ్రతక సాగాడు []
రాసిన వారు వారణాసి శ్రీ రామకృష్ణ అమరావతి - విజయవాడ

---

ఆవిరి యంత్రము లేదా ఆవిరి మంత్రము 29-=3-22

టీవీ లో రాత్రి పూట వార్తలు చివరంటా చూస్తే స్టాక్ ఎక్స్చేంజి గురించిన వార్తలు చూపిస్తాబు .[]నేను అవి తప్పక చూస్తాను [] కొనుగోలు దారుల మద్దతుతో నిఫ్టీ మూడు వందల పాయింట్లు లాభ పడింది అనంగానే నేను మా ఆవిడను కేకేసి ' ఎవరో లాభ

పడ్డారట ఈ సంతోష సమయంలో ఒక కాఫీ తాగితే బాగుంటది అని చెప్పి ఆమెను ఒప్పించి ఒక కాఫీ చప్ప రిస్తాను [] అమ్మకందారుల వత్తిడితో నిఫ్టీ నాలుగు వందల పాయింట్లు నష్ట పడింది అని వార్తల్లో చెప్పినపుడు మా ఆవిడను కేకేసి " ఎవరో నష్ట పడ్డారట .నా మనసు భాధ పడుతోంది . ఉపశమనం కోసం ఒక కాఫీ పట్రా అని ఆమె తో ఒక కాఫీ తెప్పించుకొని చప్ప రిస్తాను
ఈ కాఫీల భాద పడలేక ఆమె" ఆ నిఫ్టీ ఏమిటో అది లాభ పడటం ఏమిటో నష్ట పడటం ఏమిటో నాకు కాస్త చెప్పండి . విషయం నాకు అర్ధం అయితే నే ఇక ముందు కాఫీలు " అని మొండికి వేసింది
అప్పుడు నేను రెండు వేలు రూపాయబిళ్లలు గా సేకరించి , ఒక్కోరెండు పెద్ద ప్లాస్టిక్ డబ్బాలు తెచ్చి ఒక్కో దాంట్లో వేయి రూపాయలు చొప్పున పెట్టాను .మా ఆవిడను పిలిచి ఇదిగో ఈ డబ్బా నీది , ఈ డబ్బా నాది .[] వార్తల ప్రకారం నిఫ్టీ ఎన్ని పాయింట్లు లాభ పడితే అన్ని రూపాయలు, నేను నా వేయి రూపాయల్లోనుంచి తీసి నీకు ఇస్తాను [] నిఫ్టీ ఎన్ని పాయింట్లు నష్ట పడితే అన్ని రూపాయలు , నువ్వు నీ వేయి రూపాయలలోనుండి తీసి నాకు ఇవ్వాలి [] ఇట్లా చేసుకుంటూ వెళ్లి , మార్చ్ చివరకి లెక్కలు చూసుకుందాము [] ఈ లోపున నీకు నిఫ్టీ సంగతిఏమిటో నీకు అర్ధం అవుతుంది అని చెప్పాను [] పై ఒప్పందం ప్రకారం మేము ఇచ్చి పుచ్చుకున్నాము [] మార్చ్ 31 న లెక్కలు చూసుకున్నాము []
అమేదగ్గర 690 రూపాయలు ఉన్నట్లు లెక్క తేలింది [] నా దగ్గర 610 రూపాయలు ఉన్నట్లు లెక్క తేలింది [] ఇద్దరి దగ్గరా కలిసి 1300 వున్నవి [] మిగతా 700 ఏమయినవా ? అని మేము ఆందోళన పడి, రక్తం కారేటట్లు బుర్రలు గీక్కో సాగాము [] మా ప్రశ్నకు సమాధానంగా అన్నట్లు ఆ నాటి వార్తల్లో " నిఫ్టీ తీవ్రమైన ఆటు పోట్లకు గురి అయి, మదుపరుల సొమ్ము ఏడూ కోట్ల లక్షలు ఆవిరి అయ్యింది అని చెప్పారు [] మాకు లెక్క తేలాల్సిన 700 రూపాయలు ఆవిరి అయినాయని మాకు తెలిసింది [] మా ఆవిడకు నిఫ్టీ అంటే ఏమిటో, తెలిసింది [] నిఫ్టీ అంటే ఇడ్లీ కుక్కరులాంటిదని, అందులో పోసిన నీళ్లు ఆవిరి అయి పోయినట్లు మన సొమ్ములు ఆవిరి అయి పోతాయని , ఆవిరి అయినా నీళ్ల వల్ల ఇడ్లీలు వుడికినట్లు , ఆవిరి అయినా సొమ్ము వల్ల పెద్ద పెద్ద పారిశ్రామిక వేత్తల ఆస్తులు పెరుగుతాయని నేను తెలుసుకున్నాను అని మా ఆవిడ అన్నది [] నీకేమీ తెలియలేదు - ఇంకో ఆర్ధిక సంవత్సరం గడిస్తే కానీ నీకు నిజం అర్ధం కాదు అని నేను అన్నాను []

## గోళీల గోపన్న కథ

" అమ్మా నాకేదన్న తాయిలం పెట్టవూ ? అని పిల్ల వాడు అడిగినపుడు అతడి తల్లి ఇంత చింత పండుకు కాస్త ఉప్పు పంచదార అద్దీ దాన్ని ఒక ఉండచేసి చీపురుపుల్లకి తగిలించి పిల్ల వాడికి ఇస్తుంది [] ఆసక్తి పడి అడిగిన వెంటనే పిల్ల వాడికి లభించిన ఈ ఆహరం అతడి జిహ్వను ఫది రేట్లు చేసి . కొత్త ఆకలి పుట్టించి , భిన్న ఆహారాల పట్ల అతడికి ఆసక్తిని పుట్టించి , అతడిని బలశాలిగా చేస్తుంది [] అమ్మా నాకేదన్న తాయిలం పెట్టవూ అని అడిగినట్లే " అమ్మా నాకేదన్నా కథ చెప్పవూ? అని పిల్లవాడు అడిగినపుడు ..అతడు తన మెదడు ఎదుగుదలకు కావాల్సిన కొత్త విషయాలకు అన్వేషిస్తూ వున్నదని అర్ధం [] ఆతల్లి గనుక పిల్లవాడు అడిగిన వెంటనే చింత పండు ముద్దలాంటి కథ చెప్పగలిగి ఉంటే , అది విన్న పిల్లల మెదడు నూతన ఆలోచనలకు

ద్వారము తెరువగల బలము పొంది . అతడి మేధస్సు ఒకటికి పది రేట్లు వికసించేట్లు చేసి అతడిని బుద్ధి శాలిగా చేస్తుంది - ఇది చిన్న పిల్లల కథల పట్ల నాకున్న అభిప్రాయము [] . ఆ కథల మీద నా ప్రతి పాదన .

పూర్వము మీలాంటి , నాలాంటి అబ్బాయి ఒకడు ఉండేవాడు [] వాడికి గోళీల అట పిచ్చి [] వాడికి నా అన్న వారు ఎవరూ లేరు [] ఒకనాడు అతడు తనకు అంతకు ముందు పరిచయం లేని పెద్ద కుర్ర వాడితో గోళీలు ఆడి ఓడిపోయినాడు [] అప్పుడు వాడు ఓడిపోయిగోళీలు పోగొట్టుకున్నందుకు విచారించకుండా " వాడు నాకన్నా పెద్దవాడు అయి కూడానామీద ఏమి దౌర్జన్యము చేయకుండా ఆటలో ని నియమాలు అన్నీ ఫాలో అయి నన్ను ధర్మ భద్దము గా గెలిచాడు [] ధర్మము అమలు కాగా లభించిన ఈ ఓటమి కూడా ఒక గొప్ప విజయమే " అని కుర్రవాడుఇల్లాగా ఏమేమో తనకు మనసులో తోచిన మాటలను మనస్సులోనే అనుకున్నాడు [] బిక్క మొఖం వేయకుండా . ఆట మొత్తాన్ని ఆనందించాడు [] మనస్సులోని ఈ మాటలను ఆటగెలిచిన కుర్రవాడు గ్రహించాడు [] అతడు కుమార స్వామి [] అతడు ఏమనుకున్నాడు అంటే " వీడు ఆనాడు జూదములో ఒడి ఆనందించిన ధర్మరాజు వాలే ఆలోచించుచున్నాడు [] ఇతడిని నేను రాజుచేసెదను‹ అని సంకల్పించుకొని - మన పిల్లవాడికి ఒక గోలీ కాయను బహుమతిగా ఇచ్చి వెళ్లి పోయాడు []

ఆ రకంగా ఒక కొత్త గోలీ మన వాడి గోలీ ల సంచీ లోకి చేరింది [] మనవాడు ఒక నాడు తింటానికి ఏదన్న పడ‹డు దొరుకుతుందేమో అన్న ఆలోచనతో అడవిలోకి వెళ్ళాడు [] అప్పు డు ఒక చెట్టు కింద కమ్మగా నిద్ర పోతున్న పెద్ద పులిని చూసాడు [] ఒక తెల్లని కాకి అపులి మీద వాలి పులి చర్మము మీద వున్నా గాయాలను అందులోని పురుగులను తన ముక్కుతో కెలికి ఏరి తింటూ పులికి వైద్యము చేస్తూ వున్నది [] తనకు మేలు జరుగుతూ ఉండటం వల్ల పులి ఆనందంగా వున్నది [] ఈ తెల్ల కాకి నిజానికి ఒక బ్రహ్మ రాక్షషి [] దానికి పులి కళ్ళనుతినుట అంటే చాలా ఇష్టం [] తెల్ల కాకి పులికి మేలు చేస్తున్నట్లు చాల బాగా నమ్మించి , నమ్మించి , చటుక్కున దాని కనుగుడ్డును ముక్కుతో పీకి లటుక్కున మింగేసింది [] పులి గగ్గోలు పెట్టింది [] అది అప్పుడు , ఈ ఒంటి కంటి పులిని ఎవరు లెక్క చేస్తారు [] నా వేటలు నానుండి సులువుగా తప్పించుకు పోతాయి . నేను ఆకలికి మాడి చావాల్సి వస్తుంది అని ఏడ్చింది [] పులి ఏడ్పు విన్న మన వాడి మనస్సు కరిగి పులి దెగ్గరికి వెళ్లి , తన చేతిలో వున్నా గోళీకాయను దాని కంటి గూట్లొకి అమర్చాడు [] పులి మామూలుది అయ్యింది [] ఆతరువాత మన కుర్రవాడితో " నువ్వు ఈ చెట్టు పండ్లు తింటూ వుండు . పండ్ల తోటి కలిపి తాగటానికి కావాల్సిన పాలను - నేను నీకు ఆవుల ద్వారా ఇప్పిస్తాను " అని మాట ఇచ్చింది [] పులి చెప్పిన ప్రకారం మన వాడు అడవిలోని కి వెళ్లి అడవి ఆవులను కలిసి " ఇదిగోండి - మీరు వచ్చి ఆ చెట్టు కింద పడుకోండి . మీరు ee చెట్టుకింద ఉన్నంత సేపు పెద్ద పులి మీ మీద దాడి చేయనని మాట ఇచ్చింది అని చెప్పి వచ్చాడు

ఆవులు వచ్చి చెట్టుకింద చేరి నావి [] ఆరకంగా , మనకుర్రవాడి కింద పెద్ద ఆవుల మంద తయారు అయ్యింది [] తమకు ఎటువంటి ప్రాణ భయం లేకుండా కుర్రవాడు తమకు నీడ

కల్పించిన దానికి కృతజ్ఞతగా ఆవులు అతడిని అడవికి అధిపతి గా చేయ దలుచుకున్నాయి [] అప్పుడు ఆవులు పోయి చని పోయిన అడవి దున్నల కొమ్ములను సేకరించుకు వచ్చి , వాటిని ఒక కర్రకు త్రిసూలం లాగా అమర్చి కుర్రవాడికి బహుకరించాయి [] మనవాడు ఎల్లకాలం ఇట్లాగే గోవుల గోపన్న లాగా ఉంటే ఎట్లాగూ అని కూడా ఆలోచించిన ఆవులు , తమ పాలతో సగం సగం గా కుండలను నింపి ఒక నదీ ప్రవాహం వాలుకు విడిచి పెట్టాయి [] అవి మొత్తము ఏడు కుండలు [] నది దిగువ భాగాన స్నానం చేస్తున్న రాకుమారి ఈ ఏడు కుండలను చూసి, ఆసక్తి కొద్దీ ఆ పాలను తాగి నెత్తిన చల్లు కుంది [] పాలలోని మహత్యం కారణంగా రాకుమారి శరీరం తెల్లని పాలరంగులోకి మారి ఆమె అందం రెట్టింపు అయ్యింది [] అంతకు ముందు ఆమెకు వున్నా ముంతెడు కొప్పు గంపెడు అయ్యింది [] రాకుమార్తె తల్లికి ఎదో తెలియని అనారోగ్యం వున్నది [] ఈ పాలను తాగితే తల్లికి ఎదో మేలు జరగవచ్చునని భావించిన రాకుమారి ఆ కుండలను రాజా మందిరానికి చేర్పించింది [] పాలు సేవించిన రాణికినిమిషాలలోనే ఆరోగ్యం వచ్చింది [] కానీ ఆమె దుష్టపు ఆలోచనలు చేసి ఈ పాలు ఇచ్చిన ఆవులు ఎక్కడ ఉన్నాయో వెతికి వాటిని పట్టి తెచ్చి నాముందు కట్టి వేయండి అని ఆజ్ఞ ఇచ్చింది [] పెద్ద సైన్యము నదీ తీరము వెంట ఎగువకు వెళ్లి ఆవులను కనిపెట్టి వాటిని బంధించారు [] మన వాడి చేతిలో అడవి దున్నల కొమ్ములతో చేసిన త్రిసూలం వున్నది కదా ? అది ప్రయోగించి వాడు సైన్యమును మొత్తము నుతుక్కు తుక్కు గ ఓడించాడు [] ఈ సుసంగతి తెలిసిన రాజుగారు " నా కుమార్తెను , తద్వారా నా రాజ్యమును చేప్పట్ట దగ్గ వీరుడు ఇతడే అని భావించి , మనవాడికి గౌరవ మర్యాదలు జరిపి - పిల్లనిచ్చి పెళ్లి చేసాడు [] మనవాడు రాజుగారుఅయి - రాణిగారితో కలసి సుఖంగా జీవిస్తూ కలకాలం రాజ్యం చేసాడు [] చెప్పటం మరిచాను ఆవులు ఆవులు అన్నీ కూడా మనవాడి వెంట రాజ్యం లోకి వచ్చేసాయి []ఆ గోపాలుడే తమ రాజు అయినట్లు ప్రజలు పండగ చేసుకున్నారు []ఈ మధ్యలో ఒక సారి రాజుగారికి శత్రువులు విసిరినా ఈటె గుచ్చుకొని గుండెల్లో ఈ చివరినుండి ఆ చివరికి ఒక కన్నం పడింది [] అది ఈ ఆవుల పాలు తాగినాక తగ్గి పోయింది ఇంకా కా ఇలాగ ఎన్నో జరిగాయి [] గోవుల పట్ల రాజ్య పూజలు పెరిగి పోయాయి [] గో పూజలు చూసి దేవతలు సంతోషించారు [] సంతోషించి ఏమి చేశారు అనేది మరో పెద్ద విషయము [] గోవులకు బ్రాహ్మణులకు శుభమస్తు నిత్యం [] బై వారాణసి శ్రీ రామ కృష్ణ - అమరావతి నుండీ - విజయవాడకు వచ్చి .

టమోటో కంప్యూటర్

ఈనాటి మార్కెట్లో యాపిల్ పండుమీద , దానిమ్మ పండుమీద , కమలా పండుమీద కూడా దాన్ని మనకు అందించిన కంపెనీ వారిపేరున్న స్టిక్కర్ అంటించబడి ఉంటుంది [] ఈ స్టిక్కర్ మనకు ఏమి తెలియ చేస్తుంది అంటే " కంపెనీ వారు అనేక లక్షల పళ్ళను సేకరించి - దాంట్లో కుళ్ళినవి పుచ్చినవి వేరుచేసి మంచివి మాత్రమే ప్యాక్ చేశారు అని [] మనదగ్గరికి అమ్మకానికి వచ్చిన పండ్లలో కుళ్ళుది పుచ్చుదిఅనేది లేదని ఆ స్టికర్ వేసిన కంపెనీ మనకు గారెంటీ ఇస్తున్నది []

ఇదే రకమైన ఉద్దేశ్యముతో టమోటోలకు కూడా స్టిక్క రింగు జరుగుతుంది [] మీరు కొద్దిగా అలోచించి చూస్తే ఒక్క భారత దేశంలోనే రోజుకి కొన్ని కోట్ల కేజీల టమోటాలు ప్యాకెట్లలో పెట్టి సీల్ చేసి సూపర్ బజార్లలో అమ్ముతుంటారు [] కంపెనీలు ప్యాక్ చేసే టమోటోలు సాధారణంగా ఒక కేజీ ఉంటాయి [] కానీ ప్రతి ఒక్క ప్యాకెట్ లోను కరెక్టుగా కేజీ టమోటాలు మాత్రమే ఉండేటట్లు ఎవరు తూస్తారు అని ప్రశ్న వస్తుంది [] మీ ఇంటి ముందుకు టమోటోలు తెచ్చి తూచే అయన , తానూ రూచిన టమోటాలు కేజీ కన్నా ఎక్కువ తూగుతున్నాయి అనుకున్నప్పుడు - ఈ కాయ తీస్తే తూకం సరిపోవచ్చు లేదా ఈ కాయ వేస్తే తూకం సరిపోవచ్చు అని ఆలోచనతో, కాయలు వేసి , తీసి తూకం సక్రమం చేస్తూ ఉంటాడు అంటే వినియోగదారుడిని సంతృప్తి పరుస్తూ ఉంటాడు [] కోట్లాది కేజీలు ప్యాకింగ్ చేస్తూ వున్నపుడు వినియోగ దారుని సంతృప్తి పరచటం కోసం తూకం సరిగా ఉంచటం కోసం , కాయలు వేయటం తీయటం అనే పని ఎవరు చేస్తారు ?

దీన్ని అంటే ఈ వేయటం తీయటం అనే పనిని ఆర్టిఫిషల్ ఇంటిలిజెన్స్ కంప్యూటర్లు చేస్తాయి [] కొన్ని టమోటాలు ఒక ట్రైలో పడగానే ఆర్టిఫిషియల్ `ల్ ఇంటిలిజెన్సుతో వున్న కంప్యూటర్లు రంగంలోకి దిగి - ట్రైలో వున్న టమోటోలలో ఏది తీస్తే తూకం సరి పోతుందో అన్నది లెక్క వేసి ఆ టమోటాను లేసర్ బీమ్ వేసి చూపుతుంది [] అలాగే వున్న టమోటాలు కు ఏ కాయను కలిపితే తూకం సరిపోతుంది అనేది లెక్క చూసుకొని ట్రై కి వెలుపల వున్న కాయలలోని ఒక కాయను లేసర్ బీమ్ వేసి చూపుతుంది [] లేసర్ బీమ్ తగిలిన కాయలను రోబోటిక్ చేయి గుర్తించి తీసుకుని - సరైన కేజీ తూకంతో ప్యాకింగ్ పూర్తి చేస్తుంది [] చూసారుగా మీ ఇంటి ముందు టమోటాలు తూచే వాడు ఎంతో అనుభవముతో చేశేపనిని , నిర్ణయాలను { అనగా మోటాలు వెస్టి తీసీ సరిగ్గా కేజీ కాయలు వచ్చేటట్లు చేయటంఅనే ఆలోచనను } నేడు కంప్యూటర్లు అందులో వున్న ఆర్టిఫిషల్ ఇంటిలిజెన్స్ ప్రోగ్రాం లు , చేస్తున్నాయి [] కంప్యూటర్ కి ఆర్టిఫిషల్ ఇంటిలిజెన్స్ అంటే ఎలావుంటుందో చెప్పాలనిపించి ఇది రాసాను - ఇది చదివి నచ్చిన వారు ఆర్టిఫిషియల్ ఇంటిలిజెన్స్ ప్రోగ్రామింగ్ ఇంజినీర్లకు గొప్ప గొప్ప జీతాలు లభించాలని కోరుకోండి [] అప్పుడు సందట్లో సడేమియా లాగా జీతాలు పెరిగిన వాళ్లలో మీ వాడు మావాడు కూడా వ్వుంటారు [] నమస్కారం బై వారణాసి శ్రీ రామ కృష్ణ - అమరావతి @ విజయవాడ

కత్తి లాంటి పిల్ల

ఎదో ఒక సినిమా కామెడీ సీనులో ' కమెడియన్ " పోరీ నువ్వు కత్తి లా వున్నావు , అని హీరోఇన్ ను కామెంట్ చేస్తాడు ." నీ యబ్బ కత్తి లావుండటం ఏమిటిరా ? అని కమెడియన్ ని అసహ్యాయించుకుంటూ అతని తెలివితక్కువ తనాన్ని ఎత్తి చూపుతుంది ఆహీరో ఇన్ [] ఆ అమ్మాయి కత్తి లాఉందిరా అని మొగపిల్లలు ఎవరైనా అనటం వింటున్నప్పుడెల్లా ' మీ బొంద ఆడపిల్ల కత్తి లా వుండటమేమిటిరా ? అని వారిని దులిపేయాలని నాకు కూడా కోరిక పుట్టేది [] వాళ్ళను దులిపే ముందు అసలు ఈ మాట ఎందుకు పుట్టిందా? అనేది తెలుసుకుందామని బుద్ధి కూడా పుట్టింది [] మా ఇంట్లో వున్నా మాటలు నేర్చిన చిలకని పిలిచి ఏమిటి దీని వెనుక విషయము అని అడిగితే అది ఇట్లా చెప్పింది []

కొబ్బరి బోండాలలా , తలకాయలు ను ఏది తెగకొడుతుందో అదే కత్తి [] ఏ పిల్ల వల్లనైతే తలకాయలు కొబ్బరి బోండాల్లా తెగి కింద పడతాయో ఆపిల్ల కత్తి లాంటి పిల్ల [] విషయము ఏమిటంటే ......
కుటుంబనియంత్రణ జరిపి జనాభా పెరుగు దలను అదుపులో ఉంచాల్సిన అవసరం ఈనాడే కాదు ఆనాటి పూర్వపు రాజులకు కూడా ఉంటుంటుండేది [] ప్రతి మొగపిల్ల వాడికి గొప్ప అందకత్తెనే పెళ్లాడాలని ఉంటుంది కదా ? అయినప్పటికీ అందకత్తెలు మనకెక్కడ దొరుకుతారురా అనుకుంటూ . దొరికిన దాన్నిగబుక్కున పెళ్లి చేసుకుంటూ , వరుసగా పిల్లలని కని జనాభాను పెంచుతుండేవారు [] అప్పుడు రాజులూ మంత్రులు కలిసి అలోచించి " అందకత్తె అందు బాటులో లేకనే కదా కుర్రవాళ్ళు ఎవరైతే ఏమిలే అని నైరాశ్యం తో ఎవరినో ఒకరిని పెళ్ళాడి పిల్లలని పుట్టిస్తున్నారు [] అందకత్తె దొరుకుతుంది అంటే , ఆ ఆశతో వెంటనే పెళ్లి చేసుకోకుండా ఆగుతారు[] అందువల్ల మనము రాజ్యము తరఫున కొంత మంది అందగత్తెలు ను యువకులకు అందుబాటులో ఉంచుదాము [] ఆమెకు కత్తియుద్ధము లు నేర్పుదాము[] ఆమెను కావాలనుకున్న వారు రాజుగారు పెట్టిన కత్తి యుధపు పోటీలో నెగ్గి ఆమెను పెళ్లాడవచ్చు లేదా ఆమెతో కత్తి యుద్ధము చేసి నెగ్గి కూడా ఆమెను పెళ్లాడా వచ్చు అని ప్రకటన ఇద్దాము [] తనకోసము ఇద్దరు యువకులు తమ మధ్య తామే యుద్ధము చేసుకొని వలెనా లేక తనతో యుద్ధము చేయవలెనా అనేది అందగత్తె ఇష్టము [] గెలిచినా వారికీ , ఆ అందగత్తెకు రాజుగారి ఖర్చులతో రాజ వైభోగాలతో పెళ్లి జరిపిస్తారు [] ఓడిన యువకులు ఐదు సంవత్సరాల పాటు రాజ్యం విడిచి పోవాలి అని నియమము [] తమ పెళ్లి రాజవైభోగముతో జరుగుతుంది అంటే అందకత్తెలు కూడా సంతోషంతో ముందుకు వస్తారు []
పై రకంగా నిర్ణయం అయి. ప్రకటన అయినాక " కొందరు అందగత్తెలు రాజ్యం తరుఫున నియమింపబడి వూళ్ళల్లోకి ప్రవేశించి తమను గెలుచుకోమని సవాళ్లు విసురుతూ తిరుగుతూ ఉండేవారు [] అందమైన ఆడదాని ప్రభావము అంతా ఇంతా అని చెప్పటానికి వీలు లేదు కనుక , ఒక్కొక్క అందగత్తె కోసం, హీన పక్షం వందమంది పోటీ పడేవారు . కానీ , ఆమె ఒక్కరికే కదా దక్కుతుంది ? మిగతా 99 మంది దేశం విడిచి పోవాల్సి న పనేగదా [] ఒక్కొక్క అందకత్తె అందం ఆధారంగా ఈ సంఖ్యా వేయి వరకూ కూడా పెరుగుతుంది [] అప్పుడు ౯౯౯మంది యువకులు దేశం విడిచి దూరంగా పోవాల్సి వచ్చేది [] ఖర్మ కాలినప్పుడు కొంతమంది తలలు కత్తి దెబ్బకు ఎగిరి దూరంగా పడేవి [] ఈ రకంగా దేశంలో సాధారణ యువతులను వివాహమాడి యువకులే కరువు అయి సాధారణ యువతులకు పెళ్లిళ్లు తగ్గి - క్రమంగా జనాభా పెరుగుదల అదుపులోకి వచ్చేసింది [] రాజు మరియు మంత్రుల పుణ్యమా అని కత్తి పట్టిన పిల్ల అందానికి ఒక కొలమానంగా తయారు అయ్యింది []
పై తతంగంలో యువకులకు ఎంతో మజా వున్నా వారి తల్లి తండ్రులకుమాత్రము దుఃఖమే కదా మిగిలేది? [] అందువల్ల వారు తమ కుమారులకు నచ్చచెప్పి అందకత్తెలకోసం యుద్ధాలకు పోనివ్వకుండా ఆపేవారు [] ఆ తరువాత ఏ కాస్త అందంగా కనపడ్డ సాధారణమైన ఆడపిల్లనైనా చూసుకొని , ఈ పిల్లకూడా రాజ్యము తరఫున కత్తి పట్ట వలసినంత అందము కల పిల్ల { షార్ట్ కట్ లో - కత్తి లాంటి పిల్ల } అని భావించుకుంటూ - చివరికి " కత్తి లాంటి పిల్ల మాకు దొరికింది" అని సంబరపడుతూ తమ కొడుకుల పెళ్లిళ్లు చేసేవారు [] మనుమలు ను ఎత్తికొని ముద్దాడేవారు [] ఈ రకంగా జనాభా పెరుగుదల మరీ సున్నా కాకుండా ఆగింది []
నేటి యువకులు ఇంటర్ నెట్లో కనపడుతున్న కత్తి లాంటి పిల్లలకోసం నిజజీవితములో వెతుకుతూ , అలా వున్న ఆ ఒక్క దానికోసం ఒకరికి వంద మంది పోటీ పడుతూ , మామూలు యువతులను విస్మరించి, జనాభా నియంత్రణకు సాయపడుతున్నారని

చెప్పి - కత్తి లాంటి పిల్ల గురించిన కబుర్లు నేను ఇక్కడితో ముగిస్తాను [] ఇక మొగ పిల్లల తల్లి తండ్రులు అందు బాటులోకి వచ్చిన ఆడ పిల్లను పిల్లవాడికి చూపి " ఆ పిల్లకేమిరా కత్తి లా వుంది అని ప్రోత్సహించి , వారికీ పెళ్లిళ్లు జరిపి మనుమ సంతానాన్ని వృద్ధి చేసుకోవాలని సూచన చేస్తూ వున్నాను - ఇది రాసిన వారు వారణాసి శ్రీ రామ కృష్ణ . అమరావతి బుడతడు @ విజయవాడ - ఇట్లా ఎందుకు రాసాను అంటే " మబ్బులలో సుబ్బులు అని నేను రాసిన హాస్య ప్రహసనం వాట్సాప్ గ్రూప్ లలో షేర్ అయ్యి అయ్యి చివరికి ఎవరి ద్వారానో మా అమ్మాయికి చేరింది [] అది చదివిన మా అమ్మాయి " నాన్నా ఇది నువ్వు రాసిందేనా ? కథ ముందు వెనకాల ఎక్కడా నీ పేరు లేదు ? ఎవరో ఇది రాసినయ్యన ? అని అందరూ అనుకుంటున్నారు - నువ్వేనా అని అడిగి, ఆ తరువాత " మబ్బుల్లో సుబ్బులు " రాసింది మా డాడీ నేను అని అందరికి వాట్సాప్ ఇచ్చింది []
నీటి మీద పెళ్లి

ఒకానొక రాజుగారు ఉండేవాడు [] అయన ప్రజలనుండి ఎక్కువ పన్నులు వసూలు చేయక ప్రజలని కన్న బిడ్డలవ లే చూసుకునే వాడు [] ఆయన అత్యధికంగా వసూలు చేసే పన్ను ఎంతయ్యా ని అనగా అది ఒక గోధుమ గింజ అంత బంగారం మాత్రమే []రాజుగారి భార్య అయినా రాణిగారు చాల సుకుమార - మరియు దయార్ద్ర హృదయురాలు [] తాను తీసుకున్న నిర్ణయాన్ని విని రాణి కంట కన్నీరు పెట్టింది అంటే తన నిర్ణయం ప్రజలను బాధించే నిర్ణయము అని రాజుగారు గ్రహించుకొని ఆ నిర్ణయాన్ని ఉపసంహరించుకునే వారు [] తానూ తన ప్రజలు ఆనందంగానూ సుభిక్షంగాను ఉండటానికి రాణి యొక్క సుకుమార హృదయ మనస్తత్వమే కారణమని రాజుకు నమ్మిక కలిగింది [] అది ఎలా జరిగిందంటే ..... సుభిక్షంగా వున్నా రాజ్యాన్ని చూసి ఇంద్రునికి కన్ను కుట్టింది [] ధాన్యము అంతా ఎలుకల చేత తినిపించి రాజ్యములో కరువు నెలకొల్పాలని ఆలోచించాడు [] ఎలుకలను దండయాత్రకు పంపాడు [] ఆ రాత్రికే రాణీకిఒక స్వప్నం అయినది [] దేవి ఆమెకు దర్శనం ఇచ్చి ఒకపిల్లిని ఆమె కు అనుగ్రహించింది [] అది రాత్రికి రాత్రే లక్ష పిల్లలను పెట్టింది []కోట నిండి పోయింది []

ఇంద్రుడు పంపిన ఎలుకలు రాజ్యం మీదకు వచ్చి పడే సరికి కోటలోని ఈ పిల్లుల సేన వాటిని క్షణాలలో మింగి వేసింది [] ఇంద్రుడు ఆంతటితో ఊరుకోకోక పెద్ద పెద్ద మేఘాలను పిలిచి రాజ్యం మీద కుంభ వృష్టి కురిపించమన్నాడు [] ఆ రాత్రికి రాణికి మరల స్వప్నం అయింది [] ఆ స్వప్నంలో దేవి చెప్పిన ప్రకారం .. రాణి మరునాడు ఉదయమే స్వయంగా ఒక కొండ కొమ్మున కు ఎక్కి అక్కడ శివ ప్రతిష్ట చేసింది[] కురిసిన వర్షమంతా శివుడు తాగివేసాడు [] ఇట్లా కాదని ఇంద్రుడు సూర్యుని చెలరేగి పొమ్మన్నాడు [] రాజ్యంలో వాన పడక నీరు లేక ప్రజలు గగ్గోలు పడతారని రాజ్యం వీడి పోతారని ఇంద్రుడు అనుకున్నాడు [] [] దేవి తనకు స్వప్నంలో కనపడి చెప్పిన ప్రకారం , రాణి ఒక ఊరేగింపుగా కొండపైకి వెళ్లి , తాను ప్రతిష్ఠించిన శివుని రూపాన్ని క్రిందకు తెచ్చి ఒక చెరువు మధ్య ప్రతిష్ఠించింది [] ఇక ఆ పైన ఎంత ఎండలు కాసినా కానీ చెరువు ఎండటం అనేది జరగనే లేదు [] శివుడు ఎక్కువ వానలు పడుతున్నప్పుడు చెరువులోకి వచ్చిన నీరు అంతా తాగుతున్నాడు [] భూమికి , జనానికి నీరు అవసరమైనప్పుడు శివుడు ఆ నీటిని తిరిగి చెరువులోకి తన జటాజూటము ద్వారా వదులుతూ వున్నాడు [] ఇందంతా కొన్ని సంవత్సరాలు జరిగిన పిదప రాజు పండితులను పిలిపించి రాణీకి ఈ మహిమ అబ్బటానికి కారణం ఏమిటని ప్రశ్నించాడు

[] వారు ఏమన్నారంటే " వేరొకరి దుఃఖము చూడలేని సుకుమారి ఐన స్త్రీ యొక్క దుఃఖమును దేవతలు భరించలేరు , ఆమె ఇచ్చాను సారం నడుస్తారు ఎందుకంటే ప్రజల సంతోషమే కదా దేవతలు కూడా కోరుకునేది .[] . సుకుమారి ఐన స్త్రీ మానవులకూ దేవతలకూ కూడా మార్గ దర్శిగా అవుతుంది [] దేవతలు వారి మనో వాంఛితం నెరవేరుస్తారు []దుఃఖమునకు లోను అయినా సీత సుకుమార హృదయమే రావణుని చంపు శక్తీ అయినది గ్రహించ వచ్చును కదా ?మహా రాజా . అలాగా మన రాణిగారి సుకుమార హృదయమే మన రాజ్యమునకు శ్రీ రామ రక్ష ఐయ్యింది అని తెలియ చేశారు []

అప్పుడు రాజు ' నేను నా రాణీ కల కాలం జీవించి ఉండము కదా ? మేము అంత రించి పోగానే ప్రజలకు ఏమిటీ రక్ష? అన్ని ఆపదలు రాజ్యాన్ని చుట్టుముట్టి ప్రజలను భాదించుతాయేమో ? ఏమి మార్గం ? అని అడిగాడు [] అప్పుడు మంత్రులు, పురోహితులు బాగా ఆలోచన చేసి ఒక సుకుమార మనస్కురాలిని యువరాజునకి ఇచ్చి వివాహం జరిపించటమే మార్గమురాజా అని చెప్పారు []

అప్పుడు యువరాజు కొందరు పురోహితులతో కలిసి , సుకుమారి గురించి అన్వేషిస్తూ రాజ్యం లో పర్యటన చేస్తూ పోసాగారు []వారు ఒక చోటికి రాగా వేలాది తాడి చెట్లు కేవలం మనిషి ఎత్తు మాత్రమే పెరిగి నిండుగా ఆకులు వేసివున్న తాటి వనం కనపడింది [] అక్కడ ఒక అమ్మాయి నిలువబడి తన గోళ్ళతో తాటి ఆకులను, తమల పాకులను గిల్లి నట్లు గిల్లి పక్కనే వున్నా వారందరికీ అంద చేస్తున్నది [] వారు వందమంది వరకూ వున్నారు [] వారు ఎవరంటే పెళ్లి పందిరులకు, ఇళ్లకు కావాల్సిన తాటిఆకుల ను అమ్మే వృత్తి దారులు[] వారు కత్తితో ఎడా పెడా తాటి ఆకులను నరుకుచూ చెట్టుపై జరుపుతున్న హింసను చూసి భరించలేని ఈ సుకుమారి ఆ తాటి ఆకులను సున్నితముగా గిల్లి చెట్లనుండి వేరు వేరు చేస్తున్నది [] ఈ రకంగా ఆమె ఊరి వారు ఎవరూ గొడ్డలి కత్తివంటివి వాడకుండా చూస్తూ ఎప్పుడూ ఆ తాటి వనం లోనే అందుబాటులో వుంటూ ఊరి ప్రజలందరికి సాయ పడుతున్నది [] చెట్లకు కలిగే దుఃఖాన్ని అతి తక్కువ చేసేటందుకు జీవితాన్ని గడుపుతున్నది []యువరాజు మరియు పురోహితుడు తనను చూస్తూ వున్నారు అని తెలియని ఆ యువతీ, ఒక తాటియాకును నీటిలో వేసి , తేలుతున్న ఆ తాటియాకు మీద కూచొని దాని ఆసరాగా దాని మీదనుండి నీటిలోకి దిగి స్నానం చేసి తిరిగి తాటి ఆకు మీదకు ఎక్కింది [] ఇదేమి విచిత్రము అని యువరాజు అడిగాడు [] ఆపిల్ల ఎంతో సుకుమార హృదయురాలు [] ప్రకృతి యందు ఆమె, ఆమె యందు ప్రకృతి ప్రేమ పెంచుకున్నది [] ఇరువురూ పరస్పరం సహకరించుకుంటున్నారు . [] అందువల్ల నే తాడి చెట్లు ఎత్తు పెరగలేదు . ఆమె తమల పాకులవలె చెట్టునుండి గిల్లి తీయ వల్ల నవుతున్నది [] ఆమె స్నానం చేయటానికి తగిన సాయం చేస్తూఅవి తమ స్నేహాన్ని వెల్లడించుకుంటున్నవి [] ఈమెను మీరు వివాహం ఆడినట్లయితే ఈ విశాల ప్రకృతి మన రాజ్యముతో స్నేహం చేస్తుంది [] ప్రకృతి మనతో స్నేహితం జరిపి నన్నాళ్లు మన రాజ్యం సంవృద్ధిగా ఉంటుంది [] అని చెప్పారు []

యువరాజు ఆమెను వివాహమాడాడు [] ఆ వివాహం లో నీటి పై తేలుతున్న రెండు తాటి ఆకులపై యువరాజు మరియు సుకుమారి ఆసీనులైనారు [] తేలుతున్న తాటి ఆకులపై

ఆసీనులై రాజు రాణీ వివాహం చూసారు [] తేలుతున్న తాటి ఆకులపై కూర్చున్న మేళగాళ్ళు బాజా భజంత్రీల ను మోగించారు [] మీరు ఏమి ఊహించ దలుచుకుంటే అది అంతానీటి మీద తేలుతున్న తాటి ఆకుల మీదనే జరిగింది [] శుభం .. []

స్నాతకము

బ్రిటీష్ వారు వచ్చి మన దేశములో యూనివర్సిటీలు స్థాపించినాక.ఏడాది చివర ఒక పండుగ వంటిది జరిపి, అందులో చదివి డిగ్రీలు పొందిన వారికి పట్టాలు ప్రదానం చేయటం వున్నది [] . దీన్ని ఇంగిలీషులో కానవొకేషన్ అన్నారు [] దీనికి తెలుగు సమానార్థకం స్నాతకోత్సవం []

కానవొకేషన్ అనే మాటకు స్నాతకోత్సవం అని తెలుగులో ఎలా అర్థం చెప్పబడింది ?

ఎలాగంటే పూర్వపు గురుకులాల్లో కూడా ఇలాగ విద్యార్థులకు పట్టా ప్రదానం చేసి పంపటం వున్నది [] కుర్ర వాడికి వడుగు కాగానే, అతడు బ్రహ్మచారిగా ఉంటూ గురుకులానికి పోయి కోరిన విద్యను పొందటానికి అర్హత పొందినట్లు [] స్నాతకము అనగా గురుకులంలో కుర్ర వాని విద్య పూర్తి అయినది , గృహస్థాశ్రమంలోనికి ప్రవేశించి . ఆ భాద్యతలు నెరవేర్చటానికి కావాల్సిన సంపాదన కోసం తగిన విద్య పొంది వున్నాడు అని తెలపటం - స్నాతకం యొక్క ఉద్దేశ్యము[] . ఈ స్నాతకోత్సవం అనేది మొదట గురుకులాలోనే చేసేవారు [] అమ్మాయిలు వున్నా తండ్రులు ఆ స్నాతకోత్సవములోనే తమకు కావాల్సిన వరుని ఎన్నుకునే వారు [] అయితే శాస్త్రం ఏమి చెపుతున్నదంటే - స్నాతకం అయినా మూడు రోజులలోపు పిల్లవాడికి వివాహం అయి తీరాలి అని [] అంటే పిల్లవాడు ఉంటే ఇటు బ్రహ్మ చారిఐన విద్యార్థిగా ఉండాలి - లేదంటే గృహస్థుగా నైనా ఉండాలి [] ఈ రెండింటికి మధ్యలో ఇంకో ఆశ్రమం లేదు [] టకాటకా పెళ్లిళ్లు జరిగి యువతీ యువకులందరూ ఒక ఇంటి వారై పోవాలని గృహస్థ ఆశ్రమాలు వర్ధిల్లాలని గురువుల కోరిక ఈ నియమానికి కారణం [] స్నాతకం తరువాత పిల్ల దొరకక పెళ్లికాని పిల్లవాడు మళ్ళీ బ్రహ్మచారి అయినా విద్యార్థిగా మారు తాడు . [] స్నాతకం అయినా మూడు రోజులలోపల వివాహం కాకపోతే అబ్బాయి ఘోటక బ్రహ్మచారిగా మిగల వాల్సి వస్తుంది .[] ఈ పరిస్థితుల వల్ల జనం గురుకులాల్లో జరిగే స్నాతకాన్ని కాదని. పిల్ల కుదిరినాకనే వస్నాతకం చేసుకోవటం మొదలు పెట్టారు[] శాస్త్ర ప్రమాణము ఉన్నదా అంటే - నేను శాస్త్రములు చదువలేదు అని మాత్రం చెప్పగలను []మీరు పండితులను అడిగి చూడండి [] నేను ఒక వంద సంవత్సరాల క్రిందటి క నాటి సామజిక పరిస్థితులను వివరిస్తూ ఒకరు రాసిన పుస్తకం చదివాను [] దాని ప్రకారం అధికంగా ఆడపిల్లలు కల , ఆ దాయం లేని లాయర్ గారు , తన కుమార్తెకు ఎన్నో కట్నకానుకలు ఇస్తాను అని ఒప్పుకుంటాడు . చివరికి స్నాతకం కాగానే మొగపెళ్లి వారితో కట్నాలు కానుకలు అడిగితే కేసు వేస్తాను . ఇప్పుడు స్నాతకం జరిగిన కుర్ర వాడికి మూడు రోజులలోపు పెళ్లి చేయాలనీ శాస్త్రం చెపుతున్నది - అని చెపుతూ కొన్ని శ్లోకాలు చదువుతాడు [] పెళ్ళికి హాజరు అయినా పెద్దలంతా కూడా నిజమేనయ్యా - స్నాతకం అయినా మూడు రోజులలోపు పిల్ల వాడికి పెళ్లి చేయకపోతే మీవాడు ఘోటక బ్రహ్మ చారిగా ఉండాల్సి వస్తుందని నచ్చ చెప్పి పెళ్లి జరిపిస్తారు [] ఈ మూడు రోజుల నియమానికి దడిచే పెళ్లి యావత్తు జరుగుతుంది

[] ఇక పిల్ల వాడి తండ్రి కూడా ఈ నియమానికి దడిచే కట్నం సంగతి పక్కన పెట్టి పిల్లవాడికి వాడికి పెళ్లి జరిపిస్తాడు [] Iనిప్పు లేనిదే పొగరాదు అన్నట్లు ఈ నియమం ఒకప్పుడు కచ్చితంగా అమలు అవుతూ ఉండేది అని గ్రహించి రాసాను [] మీరు సందేహం వెలిబుచ్చినందుకు ధన్య వాదాలు []

ఈ రూలు వల్ల పెళ్లిళ్లలో అనేక గమ్మత్తులు జరిగేవి

మొదటిది .. ఆడపెళ్ళివారు స్నాతకం రోజు దాకా ఊరుకొని .. ఇప్పుడు మేము పిల్లను ఇవ్వము ( బావమరిది చేత బ్రతిమాలించము] అని అడ్డం తిరిగి వరునికి ఇస్తామన్న కట్నాలు కానుకలతో కోత పెట్టే వారు[] ఈ రకంగా పేదవారు పిల్లలకు పెళ్లిళ్లు చేసేవారు మరి కొందరు తాము ఇస్తామన్న పిల్లను కాకా ఇంకో పిల్లని పెళ్లికూతురిని చేసేవారు [] స్నాతకం అయినాక మూడు రోజుల్లోపు పెళ్లి కాకపోతే తిరిగి బ్రహ్మచారిగా మారాల్సి వస్తుందన్న జడుపుతో , ను , స్నాతకం అయినాక పిల్లను వెతుక్కుంటే ఎక్కడ దొరుకుతుంది అనే భయంతోనూ ఎపిల్ల పెళ్లి పీటలు ఎక్కితే ఆ పిల్లనే పెళ్లాడాల్సి వచ్చేది [] ఇట్లా వయసు మీరిన కన్యలకు కూడ పెళ్లిళ్లు అవుతుండేవి []

దీన్ని అధిగమించటానికని - స్నాతకం పెళ్లి పందిరిలోనే చేసుకోవటం అలవాటులోకి వచ్చింది . ఇట్లా అయితే ఏ పిల్ల పెళ్లి కూతురు గా ముస్తాబు అయినదో చూసుకొని , ఈ అమ్మాయే మనము ఎన్నుకున్న అమ్మాయి అని నిర్ధారించుకొని అప్పుడు స్నాతకానికి కూర్చునే వారు []

గమ్మత్తు కోసం ఆలోచించండి " కాశీకి పోతున్నాను అని అన్న పెళ్లి కొడుకుని ఎవరూ ఆపక పోతే ఏమవుతుంది? " పిల్లనిస్తాము పోవద్దు" అని ఎవరూ ఆపక పోతే అతను తప్పని సరిగా బ్రహ్మచారిగా మారి, మరింత ఉన్నత విద్యకోసం - అన్ని విద్యలకు మూలమైన కాశీకి నిజంగానే ప్రయాణమై పోవాల్సి ఉంటుంది .. చచ్చినట్లు చదువుకోవాల్సి ఉంటుంది .

కొడుకు పుట్టిన రోజు

మా అబ్బాయి ఆర్టిఫిషియల్ఇంటెలిజెన్స్ లో soft వేర్ ప్రోగ్రామింగ్ ఇంజినీర్ అయినాడు [] ఇద్దరం కాలక్షేపం కోసం అలా కూచొని ఉండగా అతడు నన్ను ఇట్లా అడిగాడు " నాన్నా కుడి చేయి గొప్పదా? ఎడమచేయి గొప్పదా ? అని [] వేటి గొప్పతనం ఉపయోగం వాటిది అని చెప్పి ఊరుకున్నాను [] కానీ నాన్నా మన రెండుచేతులకన్నా ఏనుగు తొండం గొప్పది . అది మన ఎడమ కుడి చేతులు చేసే రెండుపనులను ఏకకాలం లో చేసేస్తుంది" అని చెప్పి ఇంకా ఏమన్నాడంటే " నేను ఒక రోబో ని తయారు చేసి దానికి ఒక చేయి బిగించాలంటే భుజం దగ్గర ఒక జాయంటూ మోచేతి దెగ్గర ఒక జాయింటు మణికట్టు దెగ్గర ఒక జాయింటు పెట్టాలి . వేళ్ళకు వేరే జాయింట్లు పెట్టాలి . అన్ని జాయంట్లు , వాటి కి వైరింగ్ అమర్చటం క్లిష్టమైన పనే . అంతే కాకుండా జాయింట్లు వున్నా చోట అరుగుదల తప్పదు [] ఇప్పుడు నేను మా కంపెనీ తరఫున ఒక రోబోని తయారు చేస్తున్నాను దానికి చేతికి బదులు ఏనుగు తొండంఅమర్చుదామని ప్రపోసల్ పెట్టాను [] ఒక చేయికన్నా ఏనుగు తొండం చేయటం చాలా చవుక ఇంకా ఈజీ కూడా " అని చెప్పి నా అభిప్రాయం కోసం ఆగాడు

“ఏనుగు తొండం ఈజీ ఎట్లా అయ్యింది ? సృష్టిలోకెల్లా సంక్లిష్ట నిర్మాణం అదే కదా? అని నేను అడిగాను [] అతని సమాధానం ఏమంటే " ఎలక్ట్రిసిటీ ఆధారంగా అయస్కాంతంగా మారే గుండ్రని అయస్కాంతాలు కొన్ని తీసుకొని వాటిని ఒక దానిపై ఒకటి అమర్చి బిగించి వాటిలోకి ఎలక్ట్రిసిటీ పంపినప్పుడు అవి ఆకర్షణ వికర్షణా మూలంగా ఒక దానికి ఒకటి దగ్గరగాను దూరంగాను జరిగి ఏనుగు తొండం లాగ కదులు తాయి . నేను అలాంటి అయస్కాంతాలను ఏనుగు తొండం ఆకారంలో అమర్చి దానికి ఎలక్ట్రానిక్స్ ద్వారా కుత్రిమ మేధస్సు ఇస్తాను . అప్పుడది ఏనుగు తొండం చేసినట్లే అన్ని పనులు చేస్తుంది "
"ఆ మెషెన్ ఎల్లా ఉంటుంది ? ఏమి పనులు చేస్తుంది . నీ వద్ద ఏమైనా రోడ్డు మ్యాప్ ఉన్నదా ? అని నేను అడిగాను
" అది ఒక వాక్యూమ్ క్లీనర్ ని పోలివుంటుంది . దానికి ఒక వైపున నేను రూపొందించిన ఏనుగు తొండం లాంటిది బిగిస్తాను. దానికి కావాల్సిన సాఫ్ట్ వేర్అంతా కింద బేస్ లో ఉంటుంది [] నేను ఆర్టిఫిషల్ ఇంటిలిజెన్స్ ప్రోగ్రాం రాసి ఆ తొండానికి అమర్చినాక , అది ఒక చాకు పట్టుకొని ఉల్లి పాయలు తరగమంటే తరుగుతుంది , , పెనం తీసుకొచ్చి పొయ్యి మీద పెట్టి గిన్నెలో ని పిండి గంటె తో తిప్పి దోశలు వేసి . దోశలను  తిరగ తిప్పి కాల్చి ప్లేటులో పెట్టి ఇస్తుంది [] పూరీలు గారెలు , నొక్కి వాటిని భాండీలో వేసి వేపి ఇస్తుంది [] ఇవి ప్రస్తుతానికి ఉదాహరణలు [] ఆమెషీను కుత్రిమ మేధస్సును ఉపయోగించి నేను నే రాసి ఇచ్చిన ప్రోగ్రాం ప్రకారం ఏ పని చేయమంటే ఆ పనిని తొండం వుపయోగించి చేసేస్తుంది [] ఇక నీకోసం అని , నెత్తికి నల్ల రంగు వేసే పని . దానికి అవసర మైన సాఫ్ట్ వేర్  దానికి నీ కి ఫీడ్ చేసి పెట్టాను [] కావాలంటేtrimmer  తీసుకొని గడ్డం కూడా గీస్తుంది . క్రాఫ్ కూడా చేస్తుంది [] ఈ మెషిన్ నడుచుకుంటూ వచ్చి పని చేయదు కానీ , పని దెగ్గరకు దాన్ని తీసుకెడితే , చెయ్యాల్సిన పని ఏమిటో సెలక్ట్ చేసిచెబితే అన్నీ చక్కగా చేసి పెడుతుంది [] ఒక ఏనుగు పిల్ల ఇంట్లో వున్న ట్లే అనుకో [] ఏనుగు చేత రూపాయి బిళ్ళను భూమి మీదనుండి తీయించా వచ్చు అట్లాగే పెద్ద రాతి దూలాన్ని ఎత్తి పైన పెట్టించా వచ్చు [] నువ్వూ,  అమ్మ , ఏమిఏమి పనులు కావాలో వాటిని లిస్టు రాసి ఇవ్వండి నేను మెషిన్  కి ఇంటిలిజెన్స్ ఫీడ్ చేసి ఇచ్చేస్తాను " అని మా అబ్బాయి మాకు భరోసా ఇచ్చాడు

మా ఇంటి కిచెన్లో కొలువై వున్నా చెప్పిన పనినెల్ల చక్కని పిల్లల మాదిరి చేస్తూ మమ్ము ఆనంద పరుస్తున్న ఆ మెషీను ను , మీరు రేపుకాకుండా ఎల్లుండి ఎప్పుడైనా సరే వచ్చి చూసి పోవచ్చు అని ఆహ్వానిస్తున్నాము []

---------------------------------------------------

రుక్మిణీ కళ్యాణం
రుక్మిణీ కళ్యాణం చదివితే ఆడ పిల్లలకి పెళ్లి అవుతుందని మన లో ఒక విశ్వాసము [] నేను ఆలోచించే ప్రకారం చూస్తే రుక్మిణీ కళ్యాణం అనే కథ చదివి , పురుషుడి తత్త్వం పట్ల { ప్రత్యేకించి ఒక మొగవాడి పట్ల కాదు } స్త్రీకి ధర్మ బద్ధంగా ఎటువంటి ప్రేమ ఉండాల్సివుందో , టువంటి ప్రేమ వెలిబుచ్చ వలసివుందో అనేది తెలుసుకున్న మరియు ఆభావనలను ఆ ప్రేమనీ మనస్సులో నిలుపుకున్న స్త్రీకి సత్వరం పెళ్లి అవుతుందని నేను అనుకుంటాను
రుక్మిణీ దేవి శ్రీకృష్ణునికి పంపిన రాయ భారం ద్వారా " కృష్ణా నా మనస్సు నీ అందు లగ్నం అయినది - వచ్చి నన్ను చేబట్టు " అని అడిగినది . "మనసు లగ్నం అయినది"

అని రుక్మిణి అనగా అందులో కృష్ణునికి అందిన సందేశం ఏమి అయి ఉండ వచ్చు? {1} నిన్ను ప్రేమగా చూసుకొనుటకు[ సేవించుకొనుటకు } నాకు మనస్సయ్యింది అని { 2 ) నాలో జనిస్తూ వున్నా స్త్రీ సహజమైన ప్రేమ తత్వమును పొందుటకు నీవే అర్హుడయినా పురుషుడవు అని నిర్ణయించుకున్నాను అనీ చెప్పినట్లు అయ్యింది []
ఇక పరమ పురుషుడనబడిన శ్రీ కృష్ణుడికి ఏమనిపించివుండ వచ్చునంటే " రుక్మిణి నాయందు మనస్సు లగ్నము చేసికొనినది అనగా " ఆ కన్య నన్ను సేవించుకొనుటకు నా ద్వారా సంతానము పొందుటకొరకునాపై మనసు లగ్నం చేసుకొని వున్నది ఇంతకు మించి పురుషుడు కోర దగినది ఏమి ? అని "
స్త్రీలోని సేవా భావము ను మించిన ఆకర్షణ మరి దేనిలోనూ లేదు [] ఈశ్వరుడు కూడా ఈ పార్వతి నన్ను సేవించుచున్నది అన్న భావముతోటె తపో భంగము చేసుకొని పార్వతిని చేపట్టినాడు- ఇదియే సేవా భావమునకు వున్నా శ్శక్తికి ఉదాహరణ [] నాటి నుండి నేటి వరకు మొత్తము పెళ్లి తతంగము{ స్వయంవరం , పెళ్లి చూపులు లాంటివి } అంతా స్త్రీ తాను మనసున ఇష్టపడిన వారిని వివాహమాడి , వివాహమాడిన వారిని సేవించి సంతానము పొందుటకు అనుకూలత కల్పించవలెనన్న అన్న మూల సూత్రము మీదనే ఏర్పాటు అయి వున్నది []
స్త్రీ మనసు పురుషుని యందు లగ్నము అగుట" అన్న మాటలో లో ఇంత భావమున్నది [] శ్రీ కృష్ణుడు కాదనలేక పోయినాడు . ఒక యుద్ధము యుద్ధము చేయవలిసి వచ్చునని తెలిసీ అందుకు జంకక రుక్మిణిని చేపట్టి నాడు[]
ఇంత ఉపోద్ఘాతం తరువాత చెప్ప వచ్చేది ఏమంటే -- మేము ఒక పెళ్లి చూపులకు వెళ్ళాము[] మావాడి ఫోటో వారు చూసారు [] ఆ అమ్మాయి ఫోటో మేము చూసాము [] పిల్ల అందచందాలు అంత ఆకర్షణగా లేవు ఆమె తండ్రి ఆర్థిక స్థితిగతులు ఆలోచింప చేసేవిగా వున్నాయి I[] "ఫోటోలు చూసి నిర్ణయానికి రావద్దు . ఒక్క సారి పిల్లని చూసి పొండి ' అని పిల్ల తండ్రి పలు సార్లు అడగటం వల్ల పెళ్లి చూపులకు వెళ్ళాము [] అయ్యేది కాదులే అనుకుంటూ-, అనేక వ్యతిరేక భావనాలతోను ఆలోచనలతోను , కేవలం మర్యాదస్తులము అనిపించుకొనుట కోసం అని మేము వెళ్ళాము []
" అమ్మాయి నీకు వంట వచ్చునా అని ఫార్మల్ గా అడిగాము
" ఆ బాగా వచ్చునండి . వెళ్లి కాఫీ పట్టుకొని రావే అని " పిల్ల తల్లి అన్నది [] ఆపిల్ల లోనికి వెళ్లి ఒక అరగంట తరువాయి చేతిలో ని ప్లేటులో పూరీలు పెట్టుకొని తెచ్చింది [] .మా కిచ్చిన పూరీలు . మీరూ మేమూ రోజూ తినే పూరీలా మాదిరి గుండ్రం గానే వున్నాయి [] మా అబ్బాయికి ఇచ్చిన పూరీలు మాత్రం వేరే లా వున్నాయి [] ఆ అమ్మాయి ఆపూరీలు ఎలా తయారు చేసిందంటే , పిండిని గుండ్రముగా వత్తిన తరువాత దాన్ని హార్ట్ షేప్ లోకి కట్ చేసి పూరీ వండి , దానిమీద పంచదార చల్లి తెచ్చింది [] చూపులకు ఆ పూరీలుబాగా పొంగి వందరెట్లు పెద్దవి చేయ బడ్డ లిటిల్ హార్ట్స్ బిస్కెట్స్ లాగా వున్నాయి [] ఆ పిల్ల ఆ పూరీల ప్లేటును మావాడికి అందించి "కాఫీ లు తెస్తాను " అని మా అందరినీ ఉద్దేశించి చక్కగా పలికింది [] .మా వాడు తలా ఊపినాకగానీ కదిలింది కాదు [] మేము ఆనందముతో ఉక్కిరి బిక్కిరి అయినాము [] ఈ అమ్మాయి ఆ అమ్మాయి రుక్మిణి లాగానే మావాడితో " నా మనస్సు నీ యందు లగ్నం అయినదయ్యా " అని చెపుతూ వున్నది . ఇందులో కాదనటానికి ఏమి వున్నది . మా వాడు తింటూ ఉండగా చూసి మేము ఆనందము తో కడుపునింపుకున్నాము [] ప్రతి పురుషుడూ కృష్ణుడే - రుక్మిణి సందేశాన్నికృష్ణుడు కాదనలేడు అనేది నిర్ణయం అయిపోయే వున్నా సంగతే కదా? అని మేము గ్రహించుకున్నాము []
మేము అందరమూ మరి కొంత సేపు సంభాషించుకొని వీడ్కోలు తీసుకుంటున్నాము [] ఆ అమ్మాయి వడివడిగా ఇంట్లోకి వెళ్లి నాలుగు గిన్నెలు కల స్టీల్ క్యారేజీ తెచ్చి మాకు

ఇచ్చింది " మామయ్య గారు అత్తయ్య గారు ఇంటికెళ్ళినాక వంటలేమి చేసుకుంటారు " అన్నది
ఈమె మావాడి పట్ల , తద్వారా ఏర్పడబోయే కుటుంబము పట్లా కూడా మనస్సును లగ్నం చేసికొని వున్నది అని మరొక్క సారి గ్రహించి మురిసిపోయాము
'"అమ్మాయీ పెళ్ళికి మేము అప్పుడే అవునన్నట్లు కాదు ఇంకా ఎన్నో చూసుకోవాలి " అని లౌక్క్యులలా పలికిపెళ్ళికి ఒకే అన్నట్లుగా మేమేమీ ఒప్పుకోలేదు . సరే ఈ గిన్నెలు వీలు వెంట వెనక్కి అంపుతాము . లేదా జప్తు చేసుకుంటాము" " అని జోకు లాగా ఎదో అన్నాము []
" నేను బ్రతికి ఉండాలంటే వాటిని వెనక్కి పంపకండి అని ఆపిల్ల మా అందరికీ నమస్కారం చేసింది
రుక్మిణీకి కలిగిన కకల్యాణ సంకల్పం ముందు ఎందరో యోధులు , ప్రతికూలురు మట్టి కరిచారు [] ఆ కళ్యాణం ఎల్లా ఆగలేదో , అట్లాగా ఈ పిల్ల పట్లఇంతకు ముందు మాకున్న ప్రతికూల అభిప్రాయాలూ ఆలోచనలు , ఎన్ని ఉన్నాయో అన్నీ పోయి మట్టి కరిచాయి [] . ఇక పెళ్లి జరుగటమే తరువాయి అనుకుంటూ బయటకు వచ్చాము [] ఆ నాలుగు గిన్నెలు క్యారేజీకి అబ్బాయి పక్కనే సీట్ ఇచ్చాము []
దీనిపై విమర్శకు . సత్య అసత్య నిరూపణకు దిగవద్దు [] మనస్సు కు సంతోషం అనిపిస్తే సంతోషించండి [] కొన్ని సార్లు బుద్ధి మాట వినరాదు []

మబ్బుల్లో సుబ్బులు విమానం24-02-22

బి య్యే - డిగ్రీ చదువు చుండిన ఒక ఆడపిల్ల పరీక్ష రాయుచూ , తాను చదివిన చర్రిత్ర పాఠము గుర్తు చేసుకొని లేక ,ఇంటి వద్ద తానూ తిని వచ్చిన చింతకాయ పచ్చడిని దానిరుచిని దానిని తాను తయారు చేసిన విధము , . వేసిన దినుసులు గుర్తు తెచ్చుకొని ఏమవుతే అది అవుతుందిలే , అన్నిటికీ దేవుడే ఉండెను అని అలోచించి చ్చింతకాయ పచ్చడి jగురించి ఏడూ పేజీల సమాధానము రాసిపరీక్షా సమయమును గడిపి బయటికి పడ్డది

మన అమ్మాయి రాసిన పేపర్ను భోజన ప్రియుడగు ఒక బ్రహ్మణ భోజన ప్రియుడగు ఒక లెక్చరర్ గారు రుద్ధి మార్కులు వేయవలసి వచ్చెను . ఆయన మన పిల్ల రాసినది చదివి నోరు ఊరగా " ఇట్టి దానిని పెండ్లి ఆడి వండించుకొని తిని స్వర్గము చూడవలెనని మనసు పడెను [] ఆయనకు పెండ్లి కాలేదని వేరుగా చెప్పనక్కరలేదు [] ఉద్యోగము మంచిది [] పూర్వీకుల ఆస్తి చాలా కలదు [] ఆయన ఇల్లు చాలా పెద్దది . సుందరమైనది . సినిమా వారు వచ్చి ఆయింటిలో షూటింగ్లు చేసుకొనుచుండెడి వారు [] ఇదంతా ఎందుకు చేప్పాను అంటే మన లెక్చరర్ గారు అల్లా టప్పా గాడు కాదు [] ఏ పిల్ల అయినా మొగునిగా కోర దగ్గ వాడు []

మన లెక్చరర్ గారు తెలివిగా అలోచించి ,కాలేజీ లోని ఆడపిల్లలకు అందరకూ కలిపి " నాకు తెలిసిన మా ఇంటి వంటకములు" అను ఒక పోటీ వ్యాస పరీక్ష ఏర్పాటు చేసి బహుమానంగా బంగారు చెవిబుట్టలు ప్రకటించాడు[] చింతకాయ పచ్చడి గురించి రాసిన కన్యక పేరు పేరు సుబ్బు లక్ష్మి బ్రహ్మణ భోజన ప్రియురాలు [] ఆమెకూడా ఈ వ్యాసరచన పోటీలో పాల్గొన్నది [] నాకు తెలిసిన మా ఇంటి వంటకములు అని మొదలుపెట్టి ,పచ్చి మిర్చీ వేసి దంచిన గోంగూర పచ్చడి గురించి , కొత్తిమీర కారంచేయుట గురించి , అల్లము చెట్నీ చేయుట గురించీ , పెరుగు గారెలు చేయు విధము గురించి , ఆవకాయ నుపయోగించి విచిత్రమైన అన్నములు చేయుటగురించి , పప్పు దప్పలములు చేయు

విధము కావాల్సిన సామాగ్రి గురించి , పాయసములను పరమాన్నముల గురించి , ఎంతో విపులముగా రాసి ప్రథములాలుగా నిలిచి బంగారు చెవి బుట్టలు బహుమతి పొందినది [] సుబ్బలక్ష్మి యొక్క పాక శాస్త్ర పరిజ్ఞనం చూసి లెక్చరర్ గారు ఆమె పెద్దలను పిలిపించి ఆమెను ఒప్పించి వివాహము చేసుకొనెను []

లెక్చరర్ గారు రోజుకొక రుచి అడుగుటయు , అయన విద్యార్థిని అంతకు మించిన రుచులు చేసి చూపించుటయు సంభవించినది [] ఈ కారణమువలన ఘుమ ఘుమ లాడు వాసనలు ఇంటిలోనుండి వీధిలోకి వీచుట పరిపాటి అయినది {}వేరే రోడ్డున పోవాలిసిన వారు ప్రత్యేకించి సుబ్బ లక్ష్మి ఇంటినుండి వచ్చు కమ్మని వంటకములను వాసన పీల్చినా చాలునని అలోచించి - వీరి ఇంటి ముందుగా పోసాగిరి [] ఈ విషయము పేపర్లలో పడినది[] ఆ మూలకంగా ఒక పెద్ద వ్యాపార వేత్త దృష్టిలోసుబ్బలక్ష్మి వంటలు పడినవి [] ఆయన" అమ్మ గారి పచ్చడులు " అని ఒక పెద్ద పచ్చళ్ళ ఫ్యాక్టరీ పెట్టి ఈమెను చీఫ్ ని చేసెను [] మన సుబ్బలక్ష్మి వారికి అనేక మైన పొడులు పచ్చడులు చేసి ఇచ్చినది [] అవి మంచి పేరుతో అమెరికాలో కూడా అమ్ముడు అయినవి [] ఈమె , చద్దన్నాము లోనికి అని ఒక స్పెషల్ఆవకాయ . వవేడి అన్నములోనికి అని ఒక ఆవకాయ , ఇడ్లీ లోనికి అని ఒక ఆవకాయ , బిర్యానీ / పులిహోరలోనికి అని ఒక ఆవకాయ , జొన్న సంకటి లోనికి అని ఒక ఆవకాయా , గోధుమ రవ్వలోనికి అని ఒక ఆవకాయా రూపొందించి కంపెనీ వారికి ఇవ్వగా అవ్వనీన్ని అమెరికన్ూ్ న మార్కెట్టులో సూపర్ హిట్లు కొట్టినవి [] ఈ అవకాయకోసమని అమెరికన్లు చద్దన్నాము , జొన్న సంకటి వడ్డించు హొటళ్ల ముందు క్యూకట్టిరి [] మెక్డొనాల్డ్ వారు ఈ వ్యాపారమును అందుకున్నారు [] మూల కారణమగు సుబ్బలక్ష్మి అమెరికన్ వ్యాపార దిగ్గజముల దృష్టిలో పడినది [] ఇంతలో లేక్స్ కంపెనీ వారు తమ చిప్స్ అమ్మకం మరింతగా పెంచుకోవనేనని ఆశించి సుబ్బలక్ష్మిని తమ కంపెనీకి చీఫ్ ఆపరేషన్స్ డైరెక్టర్జనరల్ గా ఉద్యోగము ఇచ్చి. నాలుగు కోట్ల ప్యాకేజీ ఇచ్చినారు [] ఈ జీతమును గురించి టీవీలు - ఒక భారతీయా ఆంధ్రా మహిళా మొదటిగా సంవత్సరమునకు నాలుగు కోట్ల జీతము సాధించినది అని గురించి గొప్పగా చెప్పగా, లేక్స్ కంపెనీ వారు కలుగచేసుకొని అది సంవత్సర జీతము కాదు నెలవారీ జీతము అని చెప్పిరి [] వారు అంత జీతము ఎందుకిచ్చినారు అని మీరు అడగ వచ్చు ? ఎందుకనగా ఆమె ఒక కంది పచ్చడిని తయారు చేసి అందులో లేక్స్ చిప్స్ ను నానావేసి ఒక కొత్త రకము చిప్స్ ను కనిపెట్టినది [] దానితో కంపెనీ రోజునకు కోటి న్ డాలర్ల లాభము అదనంగా పొందినది [] అమెరికన్ అధ్యక్షుడు వాటిని తిని ' వోవ్ ఇండియా " అని అన్నాడు .[] శత్రు దేశములనుండీ కీడు సెంకించి , సుబ్బలక్షిమిని ఎవరూ కిడ్నప్ చేయటానికి వీలులేకుండా కొంత సైన్యమును కాపలా పెట్టి నాడు []

నేడు సుబ్బలక్ష్మి అనిన ఒక బ్రాండు [] ఆమె పేరు మీద పాక్ చేసిన కంది పచ్చడి కిలో ఆరువేలు చొప్పున అమ్ముడు అగుచున్నది [] సుబ్బలక్ష్మి పుట్టింటికి పొదలిచినపుడు కంపెనీ వారు ఒక విమానమును ఇచ్చి సగౌరవంగా పసుపూ కుంకుమలు పెట్టి పంపుదురు .[] పుట్టింటి వాసన తగిలిన యెడల ఆమెకు కొత్త వంటలు స్ఫురించునని గుర్తించి వారు ఈ విమానము ఏర్పాటు చేసినారు [] ఆమె పుట్టింటి వారు ఆకాశమున ఏ విమానము ను చూసినా ఆ మబ్బులలో వున్నది మన సుబ్బులు విమాన మెమో ? అని అనుకొనుచుండిరి [] అనుకోని విధముగా ఆమె అట్లే వచ్చు చుండెడిది పోవుచుండెడిది[]

ఒక అమ్మాయికి పరీక్షా సమయమున ప్రశ్నకు తగ్గ సమాధానము గుర్తు రాక పోవుటయే మంచింది అని మనకు ఈ కథ చెప్పుచున్నది [] పరీక్ష తప్పిన బంగారు తల్లులకు శుభము కలుగుగ్గాక అని కోరుచున్నాను

ఒకాయన , హిమాలయాలకు వెళ్లి బాగా తపస్సు చేసి , దేవుడిని మెప్పించి ప్రత్యక్షం చేసుకున్నాడు.

" ఎందుకు నాగురించి తపస్సు చేస్తున్నావు "

" రిటైర్ అయిపోయాను , ఏమీ తోచటం లేదు.. మీ ఇంటిపేరు ఏమిటో తెలుసుకుందామని తపస్సు చేసాను

-----------------------------------------------------------

మంచి జోరు వాన, గాలి లో ఒకావిడ , నెత్తిన ఓ గొడుగేసుకుని, అది గాలికి ఎగిరి పోకుండా రెండు చేతుల్తో దాన్ని ఒడిసి పట్టుకొని గాలికి ఎదురు వెళుతోంది.

ఓ పెద్ద మనిషి ఎదురు పడి.. చీరను జాగ్రత్త గా చూసుకో అమ్మా .. ఇప్పటికే కుచ్చెళ్లు ఊడి పోయాయి .. చీర ఏ క్షణాన అయినా గాలికి కొట్టుకు పోయేటట్లుంది ..”

"పోతే పోనివ్వండి .. చీర చాలా పాతది.. గొడుగు నిన్ననే కొనుక్కున్నాను " అంది ఆ స్త్రీ.

-----------------------------------------------------------

జపాన్ వాళ్ళు ఒక ఫ్రిజ్ కనిపెట్టారు.

నానో టెక్నాలజీ , రోబో టెక్క్నాలజీ , ఇంకా ఎవరికి తెలియని ఏదో టెక్నాలజీ ని కలగలిపి.

ఇప్పటికి ఆ ఫ్రిజ్ కోటి బిలియన్ల పైగా వ్యాపారం చేసింది. పేరు పోనీ **(PONY).**

అఫ్రిజ్ గొప్ప దనమేమిటంటే , 24 గంటలు దాటి తన లో వున్న పదార్థాలను గుర్తించి, ఇస్సిరి బయటకు పారేస్తాది. కాదని మళ్ళా . లోపల పెట్టాలని ట్రై చేస్తే , డోర్ జామ్ అయిపోద్ది. ఆతరువాత దాన్ని తూకానికి అమ్మాల్సిందే.

ఫ్రిజ్లో నే అన్నీ వారల తరబడి దాచి పెట్టే , చివర్న మొగుళ్ళకు పెట్టే ఆడవారి నుండి ..మొగాళ్ళని రక్షించటానికి అని మేము ఈ ఫ్రిజ్ తయారు చేసాం అని పోనీ **(PONY)** వారు అన్నారు.

ఫ్రిజ్ బాగా డిమాండ్ .లో వుంది.. ఇప్పుడు ఆర్డర్ ఇస్తే రెండు మూడు తరాల తర్వాత వస్తుంది..

------------------------------000----------------------------

సూర్యుడు , తన కిరణాలతో , ఎండలో తిరిగే మనుషుల్ని నల్ల రంగు లోకి మార్చేస్తాడు. కానీ తెల్ల జుట్టు ని నల్లగా , మాత్రం చేయడు... మరి అయన మనసులో ఏముందో ఏమిటో.

-----------------------------------------------000--------------

భర్త తాగొచ్చాడని భార్య పెద్ద తగాదా వేసుకుంది.

" ఇకనేను రొండు మూడు రోజులు పాటు మీ కంటికి కన పడకుండా పోతాను " అంది భార్య.బెదిరిస్తూ.

"పో, నాకేంటి అన్నాడు భర్త"

మూడో రోజు న భర్త, కళ్లుతెరిచి భయంగా చూస్తూ " దొంగ ముండ. మూడురోజులపాటు కళ్ళు తెరవటానికి వీల్లేనంత ఎర్రగారం కళ్ళల్లో పోసింది.. అని వాపోయాడు ---------------

-------------------[][][]---------------

<u>వాకర్స్ క్లబ్బులో - వెంకన్న -వాడి పెసరట్టు.</u>

ఆ వూళ్ళో ఒక వాకర్స్ క్లబ్బు వుంది.
ముందు దాన్ని గురించి తెలుసుకుందారం.
ఈ వాకర్స్ క్లబ్ ఫౌండర్ ఎవరనేది ఇతిమిద్ధంగా ఎవరికీ తెలీదు.ప్రెసిడెంట్ వున్నాడు. గడియారంలా చాల నిక్కచ్చి మనిషి . ఆయనకు చాల మంది పెద్దాఫీసర్ల దగ్గర పలుకుబడి వుంది. వాళ్లతో మాట్లాడి వ్యవహారాలు చక్క పుచ్చటానికి ఆయనకు వున్న టైం చాలీ చాల కుండా ఉంటుంది. అందుకని వ్యవహారాలన్నీ పెద్ద గుమస్తా మీద వదిలేసాడు .. ఈయన మరీ కరుకు పిండం. క్లబ్ పేరు మీద ఈగ వాలినా సహించడు .అయన డ్యూటీస్ ఇట్లావుంటై .అందువల్ల అయన కరుకుగా ఉండక తప్పదు.

1) వూళ్ళో వున్న వాళ్ళందరి పేరులు లిస్టులో ఉండాలి.

2) ఇప్పుడే పుట్టిన పిల్లలనైనా , వారి వేలిముద్రలు తీసుకొని , రెజిస్టర్లో రాసుకోవాలి .పేరు పెట్టగానే , ఆ వేలిముద్ర ఎదురుగా ఆ పేరు రాసుకోవాలి. ఎవరూ కూడా ఈ క్లబ్ మెంబెర్ కాకుండా ఉండటానికి వీల్లేదు, నడవకుండా ఉండటానికి వీల్లేదు .

.
వెంకన్న ఓ మామూలు మనిషి, అదే సమయాన పెద్ద జ్ఞ్యాని, పెద్ద మూర్ఖుడు , ఒత్తి అమాయకుడు.

ఆయనకు నేను - వాకర్స్ క్లబ్బులో మెంబర్ని అని తెలుసు. కానీ తెలీనట్లు ఫోజ్ ఇస్తాడు.

నాపేరు నాకు చెప్పకుండా రిజిస్టర్ చేశారని పై వాళ్లకి అర్జీలు పెట్టుకుంటాడు. అర్జీ మీద " నువ్వు నడవక్కర లేదు అని ఆర్డర్ వస్తుందని ' నమ్మి వేయి కళ్ళతో ఎదురు చూస్తుంటాడు. ఎందుకంటే అయన ఎందరి చేత్తో రేకండిషన్ చేయించుకున్నాడు. అర్జీ లో పస లేకపోయినా రెకమండ్షన్ వర్కౌట్ అవుతుందని.
ఒకరోజు క్లబ్బు వాలంటీర్ వచ్చి , ఇవాళ మీరు నడవాలండి అంటారు. వాళ్లతో పాటు తూపాకి పట్టుకున్న సెక్యూరిటీ గార్డ్ ఉంటాడు. ఇక మీరు నడవక తప్పదు. వాళ్ళు మిమ్మల్ని ఎంత దూరం తీసుకెడతారు , ఎప్పుడు ఇంటికి రిటర్న్ అవుతారు అన్నది వాళ్ళ ఇష్టమే . ఎందుకంటే వాళ్ళ దెగ్గరే తుపాకీ వుంది.
వెంకన్న వాకింగు బయలుదేరి, " అల్లం చట్నీ, పెసరట్టూ ఉప్మా చేసి వుంచు వచ్చి తింటాను , ఎవరినన్నా పంపించి మటన్ తెప్పించు , మధ్యాన్నానికి మటన్ బిర్యాని చేయి " అని వాకింగ్ కి బయలుదేరతాడు.

" మీరు ఎన్నడూ నడిచిన వాళ్ళు కాదు . పది మందిలోనుండి పక్కకు జారీ వెనక్కొచ్చేయండి " అని భార్య వెంకమ్మ సలహా ఇస్తుంది.
" ఆ లాగే, నిన్ను చూడకుండా, నీచేతి వంట తినకుండా నేను ఉండగలనా ' అని భార్యని ఊరడించి , అయన వాకింగుకు వెళ్ళాడు .
వెళ్లిన వాడు మల్లీ తిరిగి రాలేదు . భార్య ఏడ్చింది మొత్తుకుంది.
వేనన్న ఎందుకు ఎనక్కి రాలేదంటే , క్లబ్ వాలంటీర్లు .మనవాడిు గోడు పట్టించు కోకుండా లాంగ్ వాక్ కి తీసుకెళ్లి , ముందు ఆ వూరు, ఆ తరువాత దేశం , తర్వాత లోకం దాటించారు .

బ్రాహ్మణ

ప్రపంచంలో వున్నా అనేక జాతుల లక్షణాలు , వారి నమ్మకాలు , వారి భావాలు , వారి పోకడలు - అన్నీ వారి జానపద గాధలు పురాణ వాఙ్మయము , గేయాలు ద్వారా తెలుస్తూ ఉంటాయి . జానపద /పురాణ గాధలు ఒకమనిషిని గురించి కాక - ఒక సమాజం గురించి చెపుతాయి.

అందువల్ల - ఇంగ్లీష్ విద్యా వేత్తలు బహు దేశాలనుండి - జానపద కధలను - పౌరాణిక కధలను - సేకరించి - అధ్యయనం చేసి, జాతుల లక్షణాలను అవగాహనా చేసుకుని - ఆ కధలను సంకలనం చేసి , ఇతర జాతులకు అందిస్తారు . ఇండియానుండి కూడా చాలా కధలు సేకరించారు .ఆ కధలలో ..

**" ONCE THERE WAS A POOR BRAHMIN ""**
**"PANDAVAS LEARNED THEIR ARCHERY FROM DRONA - WHO WAS A BRAHMIN "**
**" RAMA accompanied - VASISTA - a hindoo brahman sage /Monk "**
లాంటి వాక్యాలు, ఆ కధల నిండా - కన పడతాయి. ఇంగ్లీష్ వారు ఎవరు రాసినా సరే .. వారు బ్రాహ్మణ భజన చేశారు - అనుకుంటే సింపుల్ గా పోతుందా ? **NO..**

ఒక మనిషి పేరు చెప్పి - అతడు బ్రహ్మిణ్ అని చెప్పటంలో - మావుద్దేశ్యం ఇది - బ్రహ్మిణ్ అనే మాట - వాడక పోతే - భారత దేశాన్ని అర్ధం చేసుకోలేము . అందుకని బ్రహ్మిణ్ అనే పదం వాడాము అని వారు ఈ కింది వివరణలు ఇచ్చారు.

**1) BRAHMINS ARE THE FRONT ROW PEOPLE OF INDIA**

( వీరు మిగతా జాతులకు - మార్గ నిర్దేశం చేస్తారు - ఆ మార్గం - జాతి సురక్షితంగా - సంతోషంగా - సౌభాగ్య వంతంగా ఉండటానికి ఉద్దేశించినవి ) ( ఇప్పుడు - చూడండి - చాణిక్యుడిని - వసిష్ఠుడిని -బ్రాహ్మణుడు అని పేర్కోవటం వల్ల - ఇతర ప్రపంచానికి (ఖద చదివే వారికి ) ఏమి తెలిసింది ? చాణిక్యుడు తన జాతి సురక్షితంగా - సంతోషంగా - సౌభాగ్య వంతంగా ఉండటానికి పాటుపడ్డ మనిషి అని తెలుస్తుంది . బ్రహ్మిణ్ అన్నప్పుడల్లా ప్రపంచానికి ఇదే తెలుస్తుంది .)

**2)** మనము పాస్చాతులము నమ్మే **"GOD IS ABNORMAL POSSIBILITIES - AND ENORMOUS POSSIBILITIES"** ( ఎవడు ఏదైనా చేయగలడో , ఎవడు అనంత కోటి రకాలుగా చేయగలడో వాడే దైవం ) అనే సిద్ధంతాన్ని ఆజాతిలో ప్రతిపాదించింది వీరే .( **THERE BY THEY ARE VIVID THINKERS** ) ( విశాల దృకప్ధంతో ఆలోచించ గలవారు )

3) మొదటి సారిగా - కాలం అనంతమైనది - అని గుర్తించి - దాని విభజించి దానినుండి ప్రజలకు లబ్ధి చేకూర్చినది వీరే . ( వర్షా కాలము /ఎండాకాలం /శీతాకాలం - (కాలాన్ని ఋతువును పట్టి పంటలు పడించడం , వృద్ధుల పిల్లల రక్షణ ఏర్పాట్లు - ఇలాంటి వాటికోసం ) ( పంచాంగం )

4) కణాలు- అణువులో పరమాణువు రూపాన్ని , విశాల విశ్వాన్ని - ఊహించినది వీరే ..

5) BRAHMINS ARE RARE BOOKS OR HUMAN BOOKS

ఆ జాతి చదువులకు సృష్టి కర్తలు వీరే. చదవ వలసినది ఎదో - దాన్ని వీరే ఏర్పరిచారు/ సృజించారు. ( జరుగుతున్నా ప్రతి దానినుండి - విషయాలను గ్రహించారు . గతతరం వారు గతంలో గ్రహించింది , తమ కాలంలో తమకు గ్రాహ్యానికి వచ్చింది మొత్తం కలిపి ముందు తరాలకు అందించాలన్న ఆలోచన వీరికే వచ్చింది . లేదా ఈ ఆలోచనను ఎవరు పోషించారో వారే బ్రాహ్మణులూ.)

THEY ARE HUMAN BOOKS = ఈ నాడు మనము . రకరకాల లెక్కలను ఒక పుస్తకంలో అచ్చు వేసి - చదువుకొని - విద్యావంతులం అవుతున్నాము . అలాంటిబుక్కే లేకపోతే - అన్ని విషయాలు కొత్తగా తెలుసుకో రావాల్సి వస్తే - ఏమవుతుంది ? 3X3 = 9 అని మళ్ళా మళ్ళా కనిపెట్ట వలసి వస్తుంది .

పుస్తకం అన్న ఊహే రానిరోజుల్లో - బ్రాహ్మలు - ప్రతి విషయాన్ని మెదడులోకి రాసుకుని - మర్చిపోకుండా వల్లెవేస్తూ - అడిగినవారికి పాఠం చెబుతూ - కొత్తగా తెలిసిన విషయాలని మెదడులోకి చేరుస్తూ ( పుస్తకానికి ఒక చాప్టర్ కలిపినట్లు ) తమ జీవితాలను - చదువులకు - జ్ఞ్యాన సముపార్జనకు - వేరొకరికి బోధించటానికి - ధ్యేయంగా పెట్టుకున్నారు . వీరు సంపాదన ధ్యేయంగా వున్నవారు కానునందున - పేదలు గా ఉండిపోయారు .

ఇప్పుడు చూడండి - ONCE THERE WAS A POOR BRAHMIN - అని ఉన్నదంటే - ఇక్కడ బ్రాహ్మడు డబ్బులు లేని పేద వాడు కాదు . చదువు/ జ్ఞ్యానం నిమిత్తం - సంపాదించాలి /సుఖించాలి - అనే కోర్కెను - విడనాడినవాడు .పూర్ బ్రహ్మిణ్ అన్నప్పుడు ప్రపంచం ఈ భావంతో అర్ధం చేసుకుని - చదువుకోసం - డబ్బుద్వారా పొందగల సుఖాన్ని త్యాగం చేసిన జాతి - భారతీయులలో ఒకటున్నది - అని గ్రహిస్తారు .

రాజులు , దేవుళ్ళు . పేద బ్రాహ్మ లకు వరాలు ఇచ్చినట్లు అనేక కథలుంటాయి . రాజులు - ఈ బ్రహ్మడి దెగ్గర డబ్బులేదు - అని జాలి పడి డబ్బు ఇవ్వలేదు. ఇతడు చదువు/ జ్ఞ్యానం నిమిత్తం - సంపాదించాలి సుఖించాలి అని కోర్కెను - విడనాడినవాడు - .లోకానికి చదివి తెలుసుకోవాల్సినవి సామకూర్చుతున్నాడు .- అన్న భావంతో సన్మానించారు.

.

బ్రాహ్మణా - అనే దాన్ని - ఈ దృష్టితో చూడాలి -- ఎంతో అవగత మౌతుంది.

ఈదృష్టి అయినాకూడా - అక్కడి జిగ్న్యాసులకు మాత్రమే అలవడుతుంది . మనలో- బ్రాహ్మణులను . వారి జీవన శైలిని - వేరే దృష్టికోణం తో చూసే వారు అరుదు అయినారు . రాను రాను - ఒక విషయాన్ని అనేక ద్రుష్టి కోణాలలో చూడగలమన్న/ చూడవలసి ఉందన్న భావన ప్రజలలో నశించి పోయింది . బ్రహమణులను ఎద్దేవా చేయటం ,నిరసించడం తేలిక పని కాబట్టి అది చేస్తున్నారు .. వాళ్లలో వాళ్ళు కూడా అంతే ..మేము భారత సమాజానికి మొదటి వరుసలో ని వారము - అని ఫీల్ అయితే

**అవుతున్నారుగాని - ఆ వరుసలో ఉన్నందుకు చేయవలసిన పనులు - మాత్రం పక్కకి పెట్టేస్తున్నారు.**

**---------------------------[][][][][]------------------------------**



సంసారం --- by VARANASI SREERAMA KRISHNA .

నేను నాభార్య వెళ్లి ఒక ఇల్లు అద్దెకు తీసుకొని - అందులోనికి ప్రవేశం చేసాము . ఆమె వెళ్లి ఇరుగు పొరుగు ఆడవాళ్ళకి - ఫైవ్ స్టార్ చాకోలెట్ ఇచ్చి - నవ్వి వచ్చింది .[]

రెండో రోజు ఉదయం - ఒక పెద్దవిడా - మా ఇంట్లోకి వచ్చింది మాతో పరిచయం కోసం మరియు కాలక్షేపం కోసం అనుకుంటాను .[] మేము వీపులు గోడలకి వేసి ఆంచి - చతికల పడి కూచొని వున్నాము [] రాండి .. పెద్దమ్మా - కూచోండి -అని ఆమెను ఆహ్వానం చేసి - మాపక్కనే చతికిల పడమన్నాము [] సామాను రాలేదా ? ముందుగా కుర్చీలు తెచ్చుకోవాల్సింది " అని ఆమెకొద్ద మాతో పాటు కూచుంది []

" మాకు సామాను ఉండదు - వున్నా సామాను తెచ్చేసాము [] మేమిద్దరమూ - యిల్లాగే కూచుంటాము . సంసారం సింపుల్ చేసుకున్నాము- అని చెప్పాను []

" సామాను లేకపోతే కాఫీ టీలు యెట్లా ?

" ఇద్దరమూ ఉద్యోగాలు చేస్తాము - వెళుతూ టీ - టిఫిన్లు కానించేసి వెడతాము . మాకు పాలు టీ పొడి చెక్కర డబ్బాలు వుండవు "

" బట్టలు వేసుకోవటానికి - తాడు కూడా కట్టలేదు "

" మాకు బట్టలు ఉతుక్కునే పని ఉండదు . ఆమె నాకూ కూ వేరు వేరు మెడికల్ లాబ్ లో పని [] వెళ్ళగానే బట్టలు విప్పి కంపెనీ వాళ్లకి ఇచ్చి - వాళ్ళిచ్చిన - శానిటైజ్ చేసిన డ్రెస్సులు వేసుకుంటాము[] కంపెనీ వాళ్ళు - మాడ్రెస్సులు ఉతికి - సాయంత్రం మేము వచ్చేటప్పుడు -మావి మాకిచ్చేస్తారు . మాకు బట్టల అలమరాలు - కలరా ఉండలు - సబ్బు బిళ్ళలు వుండవు []

" టీవీ తేలేదా ?

" ఎవరి ఫోన్లు వాళ్ళకున్నాయి . అవ్వే మాటీవీలూ . మాకు డిష్షు లక్కరలేదు . కేబుల్ అక్కరలేదు "

" మంచి నీళ్ల బిందె కూడా లేదు "

" వారానికి సరిపడా వాటర్ ప్యాకెట్లు - గూట్లో పెట్టుకుంటాము . మాకు బిందెలు కడవలు - బక్కెట్లు కూడా వుండవు [] మా కంపెనీ రూలు ప్రకారం లాబునుండి బయటకు వస్తూనే - తల దగ్గరనించీ - వళ్ళంతా శుభ్రం గా చేసుకోవాలి [] అదే మా స్నానం [] అక్కడే

మాటాయిలెట్ - అట్లాగే అలవాటు చేసుకున్నాము [] మరీ ఏదన్న ఎమర్జెన్సీ వస్తే వుంటాయని - నాలుగు ఎడల్ట్ డైపర్లు వుంచుకుంటాము

" ఒక్క గిన్నె కానీ - గ్లాస్ గాని - స్టవ్ గానీ కనపడదేంటి ?"

"  ఇద్దరమూ క్యాంటీన్లలో తింటాము [] అక్కడ నచ్చక పోతే స్విగీ లో ఆర్డర్ ఇచ్చుకుంటాము [] రాత్రిళ్ళు బండి దగ్గర చపాతీలు తిని లస్సీ తాగుతాము "మాకు గిన్నెలు - కుక్కర్లు - పాలగిన్నెలు - అంట్ల సబ్బులు వుండవు "

" బండి తెచ్చుకున్నారా ?

" లేదు - అరకిలో మీటర్ నడిస్తే - కంపెనీ బుస్సు వస్తుంది . . ఎవరన్నా లిఫ్ట్ ఇస్తే ఎక్కి వస్తాము [] షేర్ ఆటో ఎక్కుతాము [] లేదంటే  నడిచి వస్తాము [] మాకు బండ్లు - దానికి మెకానిక్లు - అందులోకి పెట్రోల్ - టైర్లలోకి గాలీ అవసరం ఉండదు .

" అసలు మీకున్న సామాను ఏమిటి ?

" మూడు పెద్ద ట్రాలీ బ్యాగ్లు .[] ఒక దాంట్లో మెత్తటి బొంతలు - ఎయిర్ పిల్లోలు - పక్క దుప్పట్లు - కప్పుడు దుప్పట్లు - టవల్స్ పెట్టుకుంటాము [] సాధ్యమైనంత వరకూ నేలమీదనే - తలకింద చేయి వేసి పడుకుంటాము [] మాకు మాసిన గలీబులు - దుమ్ము పట్టిన దుప్పట్లు వుండవు . అందుకని బట్టలు ఉతుక్కోవటం కూడా ఉండదు "

" మిగతా రెండింటిలో - ఏముంటాయి ?

నీలం దాంట్లో ఆమె బట్టలు - నల్ల దాంట్లో నా బట్టలు .ఎవరిదీ వాళ్ళు సర్దుకుని వుంచుకుంటాము [] ఆమెకు పోవాలనిపించినపుడు - బ్యాగు లాక్కుంటూ వెళ్ళి - వాళ పుట్టింటి కి బస్సు ఎక్కు తుంది .[] నేను అంతే [] ఇద్దరం కలిసి వెళ్లినా అంతే . విడిగా వెళ్లినా అంతే . [] మాకు ప్రయాణపు హడావుడి - బట్టలు సర్దుకోవటం వుండవు .

" చివరికి చీపిరి కూడా లేనట్లుంది ? "

" ఒక పనమ్మాయికి పురమాయించాము [] దాని సొంత చీపురు - మాపు - బకెట్ నీళ్లు తెచ్చుకొని - ఇల్లు తుడిచి వెళ్లి పోతుంది [] మాకు డెట్టాలు - విమ్ము - రిమ్ములు వుండవు "

" ఏందో నాయనా ? అంతా కలికాలం లాగుంది . ఏమీ సామాన్లు లేని - ఏ కష్టాలు నష్టాలు లేని  మిమ్మల్ని చూసి - మీది ఓ సంసారం అనాలని పించటం లేదు .  ఏమనుకోవద్దు నాయనా . పెదముండను అడుగుతున్నాను .మీరు నిజంగా పెళ్లి అయినా వాళ్లేనా ?

మాఆవిడ వెంటనే ఫోను ఓపెన్ చేసి - మా పెళ్లి ఫోటోలు చూపింది [] ఆమె సంతృప్తి పడలేదు - ఏందో నాయనా ఫొటోల్లో మ్యాజిక్ ఉంటుందంటగా ? అని నోరు చప్పరించింది [][][]

మా ఆవిడా కు స్పోర్టివ్ నెస్ ఎక్కువ [] వెంటనే తాళి తీసి " దీన్ని - ఈ పెద్దమ్మ ఎదురుగా ఇంకో సారి కట్టండి ...  ఏమవుతుంది ? ఆమె సాక్ష్యం మూలకంగా - మనము నిజమైన భార్య భార్య భర్తలమని - మనదీ సంసారమే నని తేలిపోతుంది " అన్నది.

[][][]

**నూతన వధూ వరులనుదీవిస్తూ ఆ పెద్దావిడ ఒక సెల్ఫీ దిగింది - దీవెనలు పొందుతూ మేమొక సెల్ఫీ దిగాము [] మీకు షేర్ చేస్తాను [] చూద్దురు గాని []**

**[][][][] ENDS [][][][]**

**------------------------------------------------------------------------------------------------**

**[][][][] ENDS [][][][]**

**------------------------------------------------------------------------------------------------**